# పరిణీత

Parineeta

[నవల]

మూలం:

శరత్ బాబు

Sarat Babu.

[illegible]

'[illegible]'

Valmiki.



ప్రచురణ:

జ్యోతి కార్యాలయం,

మద్రాసు-17.

# పరిణీత

ఇంద్రజిత్తుని శక్తి ప్రహారానికి గురికాబడిన లక్ష్మణుని ముఖం వైవర్ణ్యం తను చూసింటే చూసి ఉండవచ్చు. ఇదమిత్థమని చెప్ప లేము గానీ, తన భార్య అయిదవసారి గూడా కూతురునే కన్నదన్న కబురు వినంగానే, గురుచరణుని ముఖం, ఆ ఉదయపు కాంతిలో సైతం నల్లబడ్డది.

గురుచరణుడు బ్యాంకు గుమాస్తా. లెక్కలు ముక్కలు చేసుకొని నెలకు అరవై రూకలు తెచ్చుకొంటాడు. బాడుగలుతోలే బండి గుర్రం లాగా, అతని శరీరం, విపరీతమైన శ్రమకు అలసటనంది, శుష్కించి పోయినట్లే, ముఖమూ, కళ్లుగూడా, నిర్వికారంగానూ, నిర్లిప్తంగానూ ఉన్నాయి. దారుణమైన ఈ శుభవర్తమానం, ఈ ప్రభాతవేళ చెవిన బడటంతో, అతను నిశ్చేష్టుడైనాడు. త్రాగుతున్న హుక్కా అలా, చేతిలోనే ఉండిపోయింది. పురాణం కాలంనాటి గాలీసు నానుకొని, గోడకు చేరగిల బడిన గురుచరణునికి, దీర్ఘంగా నిశ్వసించే ఓపిక గూడా లేకుండా పోయింది. ఈ శుభవర్తమానాన్ని తన దాకా తీసుకొచ్చినది, తన మూడో కూతురు అన్నాకాళి. ఆ పిల్ల ఆదరా బాదరా తండ్రి దగ్గర కొచ్చి, 'చూద్దువు గాని రా నాన్నా' అన్నది.

గురుచరణుడు భారంగా అన్నాకాళికేసి చూశాడు. బలవంతంగా గొంతు పెకలించుకొని 'కాసిని చల్లని నీళ్లు తెచ్చిపెట్టు తల్లీ! దాహంగా ఉంది!' అన్నాడు.

అన్నాకాళీ నీళ్ళకోసం లోపలి కెళ్ళింది.

ఆ పిల్ల నిష్క్రమణంతో, గురుచరణుని స్మృతి పథంలో మెరిసింది పురిటింటి ఖర్చులు. ఆ వెంటనే ఇసుళ్ళ పుట్ట విచ్చినట్లు ఎన్నో ఊహలు, కోకొల్లలుగా చెలరేగాయి ..

క్రిందటేడు రెండవ కూతురు పెళ్లికని, బౌ బజారులోని రెండంతస్తుల భవనాన్ని తాకట్టు పెట్టాడు. ఆ డబ్బు తాలూకు వడ్డీ, ఇప్పటికి ఆరు నెల్లనుండీ, చెల్లు వేయడమే లేదన్న సంగతి జ్ఞాపకమొచ్చింది. అందులోనూ నవరాత్రి మహోత్సవాలు ఎంతో దాపులో కొచ్చాయి. అమ్మాయికి, ఈ పండుగకైనా, చీరా సారే పంపకపోతే బావుండదు. ఇంత ప్రొద్దు పోయిందాకా బుర్ర బద్దలు కొట్టుకొన్నా, జమా ఖర్చులు సరిపోలేదు. ఇవాళ మధ్యాహ్నంలోగా లెక్కలు తనిఖీకి పంపాలి. వీటన్నిటికీ తోడు పైఆఫీసరుగారు వేంచేసి జారీచేసిన 'ఫర్మానా' ఒకటి కళ్ళ ముందు భూతంలా మెసులుతోంది. ఆఫీసు కొచ్చే ఉద్యోగులంతా మురికి గుడ్డలతో రాగూడదట. అలా వచ్చిన వారికి జరిమానా పడుతుందట. చాకలివాడి అయిపూ ఆనమాలూ లేదు. వారం రోజుల క్రిందట, ఇంట్లో ఉన్న గుడ్డల్లో సగభాగం లంకించుకొని, ఆ రజకశ్రేష్ఠుడు ఎటో ఉడాయించాడు. ఈ సమస్యలన్నీ చెదపురుగుల్లా గురుచరణుని బుర్రను దొలిచేస్తున్నాయి. అతను స్థిమితంగా కూచోను గూడా కూచోలేకపోయాడు. హుక్కా గొట్టం పట్టుకొని జారగిలబడ్డాడు.

'భగవంతుడా!' అన్నాడు గురుచరణుడు. 'ఈ కలకత్తా మహా పట్నంలో ఎందరో ప్రతిరోజూ, బండ్లక్రింద, కారుల క్రిందపడి, చనిపోతున్నారు! వారందరి కంటే, నేను చేసిన ద్రోహం తక్కువదా స్వామీ! కారుణ్య మూర్తీ! ఓ పెద్ద మోటారుకారును నాగుండెల మీదుగా తోలించి, నన్ను కడతేర్చు. ఈ యాతనలు నేను పడలేను.'

'నాన్నా!' అన్నది అన్నాకాళి 'ఇదిగో నాన్నా మంచినీళ్ళు... ఇంద'

గురుచరణుడు భారంగా లేచి, గ్లాసందుకొని, ఒక్క గుక్కలో త్రాగి, కూతురును గ్లాసు పట్టుకెళ్ళమన్నాడు.

అన్నాకాళి వెళ్ళిన వెంటనే లలిత గదిలో కొచ్చి, 'మామయ్యా! టీ తీసుకొచ్చాను.' అన్నది.

ఆ పేరు వినంగానే గురుచరణుడు, పడుకొన్నవాడల్లా లేచి కూచు న్నాడు. లలిత ముఖంలోకి నాలోచనగా చూశాడు. అతని దిగులు సగా నికి సగం హరించి పోయినట్లయింది.

'లలితా! రాత్రల్లా జాగారం చేశా వనుకొంటాను. ఇలా రా తల్లీ! వచ్చి, ఇక్కడ కూచో!'

లలిత సిగ్గు పడ్డది.

'నేను ఎక్కువ సేపు మేలుకోలేదు మామయ్యా!' అన్నది నవ్వుతూ దగ్గరికొచ్చి.

సంసార సంబంధమైన వివిధ వ్యథా కులితత్వంచేత ఆ కాలక్షేపా న్యానికి గురి కాబడిన మాతులుని హృదయంలో, ప్రచ్ఛన్నంగా పరవ టిల్లే భావాలను లలిత గ్రహించినట్లు, ఆ కుటుంబంలోని మరెవ్వరూ గ్రహించ లేదు.

'అలాగా అమ్మా! పోనివ్. కాస్సేపిలా నా దగ్గరగా వచ్చి కూచో.' అన్నాడు గురుచరణుడు.

లలిత, దగ్గరగా వచ్చి కూచుంది. గురుచరణుడు ఆ పిల్లతల నిమ రుతూ ఇలా అన్నాడు:-

'తల్లీ! నిన్నో కలవాడి ఇంటి కోడలుగా చేయాలి. నిర్విఘ్నంగా ఆ పని చేసిన నాడు, ఒక సత్కార్యం చేశానన్న సంతృప్తి నాకు లభి స్తుంది.' అన్నాడు గురుచరణుడు.

లలిత నిశ్శబ్దంగా కప్పులోకి టీ వంపుతున్నది.

'నాలాంటి దరిద్రుని కొంపలో పడటం మూలంగా సుఖమనే దేమిటో నీవు ఎరగక పోతున్నావు. విశ్రాంతి లేకుండా, రాత్రింబవళ్లు బండ చాకిరీ చెయ్యవలసి వస్తున్నది. కదా తల్లీ!'

'మన పని మనం చేసుకోవటం తప్పా మామయ్యా! అదీ కాక— నేనొక్కతే నే కాదు కదా; అందరూ చేస్తున్నారు. వారితోబాటు నేనూ చేస్తున్నాను.'

గురుచరణుడు నవ్వాడు,

'అయితే ఇవాళ వంట ప్రయత్నాలంటూ—అసలు ఉన్నయ్యా అమ్మా?'

'ఎందుకు లేవు మామయ్యా! నేను వండుతాను.'

'నువ్వా?' అన్నాడు గురుచరణుడు ఆశ్చర్యపోయి. 'నీకు వంట వండడం కూడా చేతనవునా లలితా?'

'ఆఁ. అత్తగారి వద్ద అవన్నీ నేను నేర్చుకొన్నాను!'

'నిజంగానా?' అన్నాడు గురుచరణుడు కప్పు క్రిందపెట్టి.

'నిజమే మామయ్యా! నామాట అబద్ధమనుకొంటే, అత్తయ్య నడుగు. నేనన్ని రోజులనించి వంట చేస్తున్నానో నీకే తెలుస్తుంది!'

అన్నది లలిత తలవంచుకొని. గురుచరణుడు, ఆమె తలమీద చేయి వేసి, మనస్సులోనే ఆశీర్వదించాడు. ఆయన మనస్సు తేలిక పడింది.

గురుచరణుని ఇల్లు వీధి ప్రక్కనే, కొంచెం ఎత్తుగా ఉన్నది. అతను టీ త్రాగుతూ, కిటికీలోంచి బైటికి చూశాడు. అల్లంత దూరాన శేఖర్ కనిపించాడు. గురుచరణుడు, పెద్దగా పేరుబెట్టి పిలిచాడు. ఆజానుబాహువైన ఓ అందాల యువకుడా పిలుపు విని, లోపలికి ప్రవేశించాడు.

'శేఖర్! ఆలా కూచోవోయ్! మా పిన్ని చేసిన ఘనకార్యం విన్నావటోయ్ శేఖర్!'

'మళ్లీ ఆడపిల్లనే కన్నదనుకొంటాను. అవునా బాబాయ్?' అన్నాడు శేఖర్ నవ్వుతూ.

'నాయనా! నువ్వలాగే త్రోసి పారేస్తావుగానీ ఆ 'అంతేనా' అన్న పదంలో ఎంత శక్తి ఉన్నదో, నాకు మాత్రమే తెలుసు.'

'బాబాయ్! అలా అనకు. ఈ మాటలు పిన్ని విన్నదంటే చాలా బాధపడుతుంది. అదిగాక, భగవత్ప్రసాదితమైన బిడ్డ, ఆడయినా, మొగయినా, ఆప్యాయతతో, ఆదరించాలిగానీ, అవజ్ఞ చేయగూడదు.'

గురుచరణుడు ఓ క్షణం మౌనంగా ఉన్నాడు.

'శేఖర్! ఆప్యాయంగా ఆదరించాలని నాకు తెలీదనుకోకు. కానీ ఆ భగవంతుడు కూడా న్యాయాన్యాయాలు ఆలోచించాలి. నేనా పేద

వాణ్ణి, నాకింతమంది పిల్లలెందుకు చెప్పు. 'నాది' అని చెప్పుకోదగ్గదేమీ, దరిద్రం మినహా—నాకు లేదాయె! ఉంటున్న ఈయిల్లు మీ నాన్నగారికే తాకట్టు పెట్టానన్న సంగతి నీకు తెలుసు గదా! అయినా, నేను దానికి విచారించను. కానీ ఈ లలితను చూడు శేఖర్ బాబూ! దీనికి తల్లిదండ్రీ లేరు. రారాజుల అంతఃపురాలలో మసలవలసిన మాణిక్య మిది. చేజేతులా, ఆ కాయ గోకాయ గాడి కివ్వడమంటే ప్రాణం, ఎలా విలవిలలాడు తుందో నువ్వాలోచించు. నేను దరిద్రుణ్ణి. పిల్ల అందానికి తగిన సంబంధం తేలేను. నా తాహతుకి తగినవాడికిచ్చి ముడి పెడదా మను కొంటున్నాను. ఇప్పుడు దీనికి పదమూడేళ్ళు వెళ్ళి, పద్నాలుగు మొన్ననే వచ్చింది. కేవలమూ డబ్బులేక పోవడంవల్లనే, ఇంతవరకూ, లలిత పెళ్ళి విషయం, ప్రస్తావించకుండా ఊరుకోవలసి వచ్చింది."

గురుచరణుడు ఈ మాటలని కంట తడి చేసుకొన్నాడు. అది గ్రహించి కూడా శేఖర్ మెదలకుండా ఊరుకొన్నాడు.

"శేఖర్!" అన్నాడు గురుచరణుడు కొంతసేపాగి. "మీ మిత్రవర్గాలలో, ఎవరికన్నా ఈ పిల్ల నిచ్చి చెయ్యడానికి అవకాశ ముంటుందేమో, కాస్త ఆలోచించు నాయనా! ఈ కాలపు యువకులు, కట్నకానుకల కంటే, పిల్లదాని అందచందాలు, గుణగణాలు ముఖ్యంగా చూస్తున్నారని విన్నాను. అలాంటి సౌభాగ్యులలో ఏ ఒక్కడైనా మా లలితను చేసుకో గలడేమో చూడు. నీకు మహా రాజపదవి లభించాలని ఆశీర్వదిస్తున్నాను నేను. నా కొక్కటే మాట చెప్పు. వేరే ఆందోళనపడను. మీ తండ్రిగారికి నేనంటే ఎంతో గురి. నన్నో తోబుట్టువులాగా చూసుకొంటుంటారాయన."

'అలాగే చూస్తాను బాబాయ్!' అన్నాడు శేఖర్ తల పంకించి.

'నాయనా! కాస్త మనస్సులో ఉంచుకో. మరిచిపోకు. ఇంత పిల్లప్పటి నుండీ నీ దగ్గరే పెరుగుతోంది. దాని సుగుణాలను గురించి నీకు నేను చెప్పనవసరం లేదు. కేవలం బుద్ధిమంతురాలే కాదు శేఖర్, ఇప్పుడది ఇంటి పనంతా చేస్తున్నది. మా సంసారం భారమంతా, అదే మోస్తున్న దన్నా ఆశ్చర్యం లేదు.'

మామ మాటలు వింటున్న లలిత, ఒక్కసారి కళ్ళు విచ్చి చూసి, మళ్ళా క్రిందికి దించుకొంది. ఏదో చెప్పాలనేమో, ఆమె పెదవులు కదిలాయి.

'ఇప్పుడది లేనివాని పంచన ఉన్నది గానీ, దానిరాత ఇలా ఉండవలసింది కాదు శేఖర్. వాళ్ళనాన్న ఎంత పెద్ద ఉద్యోగో నీకు తెలుసు గదా! ఎంత సంపాదించాడో కూడా నీకు నేను చెప్పనవసరం లేదు. అయినా లాభ మేముంది! యావదాస్తీ దానధర్మాల క్రింద ఖర్చు పెట్టి, కూతురును బికారిని చేశాడు.'

ఈ మాటకూ శేఖర్ మౌనంగానే ఉండటంతో గురుచరణుడు మళ్ళీ చెప్పసాగాడు.

'నే నన్నది కూడా కొంతవరకే నిజం శేఖర్! కూతురుకు ధన రూపంలో ఏమీ ఇవ్వని మాట నిజమే! కానీ వేలాది దుఃఖితుల దుఃఖాన్ని పోకార్చి, లభించిన ఆ పుణ్య సంచయాన్ని హస్తార్భతంగా, తనయ కిచ్చి వెళ్ళాడు. ఆ 'నిధి' కూడా లేకపోతే, లలిత ఈ యీడుకే అందరిచేతా 'అన్నపూర్ణ' అనిపించుకో గలిగేదా? ఏం శేఖర్ నువ్వు చెప్పు?'

శేఖర్ జవాబివ్వడానికి :గులు, తనలో తాను నవ్వుకొని పోవడానికి లేచాడు.

'ఎక్కడికి నాయనా, ఇంత పెందరాడే బయలు దేరావ్?' అన్నాడు గురుచరణుడు.

'బారిస్టరు గారింటికి బా:గా'య్!' అన్నాడు శేఖర్.

'మంచిది... శేఖర్! నే:న్నమాట, కాస్తమనసులో ఉంచుకో. మా లలిత నల్లటిదన్నమాటేగా: ఇలాంటి సద్గుణరాశి, ఈ ప్రపంచమంతా గాలించినా దొరకదు.'

శేఖర్ నవ్వుతూ తల పం:కించి వెళ్లి పోయాడు.



ఒకప్పుడు నవీనరాయ్ బెల్లపు వ్యాపారి. ఆ వ్యాపారంలోనే ఆయన లక్షలు గడించాడు. ఇప్పుడా బాదరబందీ అంతా వదులుకొన్నాడు. ఇంటిపట్టునే ఉండి ఇంత వడ్డీ వ్యాపారం చేసుకొంటున్నాడు. ఆయన కిద్దరు కొడుకు లున్నారు. పెద్దవాడైన అవినాశుడు న్యాయవాది. రెండోవాడు శేఖర్ ఎం. ఏ. ప్యాసైయాడు. ఇటీవలి దాకా ఎప్రెంటిస్ చేస్తూ క్రిందటేడే 'అటర్నీ' అయినాడు. సగశ

మధ్యంలో వారికో మూడంతస్తుల భవనముంది. దాని నానుకొనే గురు చరణుని డాబా ఉన్నది. ఈ కారణాన ఆ రెండూ కుటుంబాలు ఎంతగానో కలిసి పోయాయి. ఈ రెండు కుటుంబాలలోని ఆడవారు, ఈ దోవనే రాకపోకలు సాగిస్తుంటారు.

శ్యాం బజారులోని ఓ శ్రీమంతుల కుటుంబంతో, చాలాకాలం నుండీ, శేఖరుని వివాహ విషయం చర్చించ బడుతూ ఉన్నది. ఆనాడు పిల్ల తరపువారు వచ్చారు. వచ్చే మాఘమాసంలో పెళ్ళి లగ్నాలు పెట్టుకొందామన్నారు. దీనికి శేఖర్ తల్లి ఒప్పుకో లేదు. ఆమె కెన్నో అభ్యంతరా లున్నాయి. ఒక టేమిటంటే, ఇంతవరకూ 'అబ్బాయి' అమ్మాయిని చూడలేదు. చూసి వాడు ఇష్టపడాలి. ఇష్టపడంగానే—అదెలాంటి గొప్ప సంబంధమైనా చేసేందుకు వీలులేదని, పని మనిషి ద్వారా కబురు పెట్టిందామె.

ఇవన్నీ అనవసరమైన ఆర్భాటాలని నవీనరాయ్ గారి అభిప్రాయం. డబ్బు ప్రధానం గానీ, ఇలాంటివన్నీ ముఖ్యం కావని శ్రీవారి విశ్వాసం. సాక్షిగా జరిగిపోతున్న వ్యవహారానికి, భార్యామణి అడ్డు తగలడంతో, ఆయనగారికి కోపం వచ్చింది.

'ఇంతదాకా వచ్చిన తరువాత ఇదేం మాట! పిల్లను ఇదివరకో సారి చూడటం జరిగింది గదా! ముందు 'ఖాయం' అనుకొంటే, తాంబూలాలు పుచ్చుకొనే ముందు, మరోసారి చూసుకోవచ్చు.' అన్నాడు.

అయినా ఆ యిల్లాలు అందు కంగీకరించ లేదు. తన అనంగీకారాన్ని తెలియ జెయ్యనూ లేదు. ఈ నిరసనకు నవీనరాయ్ గారు మండి పడ్డాడు. భార్య చేసిన 'కాని పని'కి ప్రతిక్రియగానేమో, ఒంటి గంట దాటాక భోజనం చేసి, వీధి గదిలో పడుకొన్నాడు.

శేఖర్ గది మూడో అంతస్తులో ఉన్నది. స్వతహాగా అతను విలాసమయ జీవి. అందుకని అతని గది కూడా చక్కగా అలంకరించబడి ఉంటుంది. ఇది జరిగిన అయిదారు రోజుల తరువాత, ఒకనాడు నిలువుటద్దం ముందు నిలబడి, పెళ్లి కూతురును చూసి రావడానికై ముస్తా

బవుతున్నాడు. లలిత గదిలోకొచ్చింది. ఒక్క క్షణం అతన్ని పరకాయించి చూసి అన్నది:

'శేఖర్! పిల్లను చూడడానికి వెళుతున్నావా?'

'అవును' అన్నాడు శేఖర్ వెనుదిరిగి. 'లలితా! ఎలా ఉంటే పెళ్ళికూతురకు నచ్చుతానో నాకు తెలియదు. ఆవిడకు నచ్చేట్లుగా నన్ను కాస్త ముస్తాబు చేస్తావా?'

లలిత నవ్వింది.

'నాకిప్పుడు వెసులుబాటు లేదు శేఖర్! డబ్బు తీసుకెళదామని వచ్చాను.' అంటూ దిండు క్రింద వెదికి, తాళాలు తీసుకొని, బీరువా తెరిచి, కొన్ని నోట్లు లెక్కించుకొన్నది. చెంగున ఆ నోట్లను ముడివేసుకొంటూ అన్నది: 'శేఖర్! అవసరమొచ్చినప్పుడల్లా ఇలా డబ్బు పట్టుకెడుతున్నాను. ఈ బాకీని ఎప్పుడు తీర్చాలో, ఎలా తీర్చాలో, నాకు బోధపడడం లేదు.'

'బాకీ ముందితే లలితా! మళ్లీ గాని తీరిపోతుంది.' అన్నాడు శేఖర్ బ్రష్‌తో క్రాపు దువ్వుకొంటూ.

ఆ మాటలోని అంతరార్థం లలిత గ్రహించలేక అలాగే చూస్తూ నిలబడింది.

'ఏం అలా చూస్తున్నావ్? ఇంకా నీకు అర్థం కాలేదన్నమాట. అవునా లలితా?'

'ఊఁహుఁ... అర్థం కాలేదు.' అన్నది లలిత తలఅడ్డంగా తిప్పుతూ.

'ఇప్పుడు నీకర్థం కాదు. నిజంగా నీకది అర్థమవ్వాలంటే, నువ్వు మరికొంచెం పెద్దదానివి కావాలి.' అన్నాడు శేఖర్ బూట్లు తొడుక్కొని బైటికి వెళ్ళిపోతూ...

చీకటి పడింది. శేఖర్ ఓ సోఫాలో పడుకొని కళ్లు మూసుకొని ఉన్నాడు. తల్లి వచ్చింది. శేఖర్ చివుక్కున లేచాడు. ఆమె గారు ఓ కుర్చీమీద కూచుంటూ అన్నది: 'నాయనా! పిల్లను చూసొచ్చావు గావును. ఎలా ఉందిరా నీకు?'

'బాగానే వుంది' అన్నాడు తల్లి ముఖంకేసి చూసి నవ్వుతూ.

భువనేశ్వరికి దాదాపు యాభై సంవత్సరాలుంటాయి. కానీ కాయపారు మనిషి గావడం మూలాన, చూసేవారికి అంత వయస్సున్న దానిలా అవుపించదు. క్రొత్తగా చూసిన వారామెను, ముప్పయ్, ముప్పయ్ ఐదేళ్ళ కంటే మించి ఉండదని అంటారు! రూపం ఎంత సాధువుగా ఉంటుందో, ఆమె మనస్సు కూడా అంత నిర్మలమైనది, దయామయమైనదీను. ఆమె పల్లెలో పుట్టింది. అక్కడే పెరిగింది. కానీ, పట్టణపు మర్యాదలు తెలియని మనిషని, ఎన్నడూ అనిపించలేదు. నవనాగరికతకు నిలయమైన ఈ పట్టణాల వాతావరణము, ఇక్కడ అవలంబించే, పద్ధతులను ఆమె సులభంగా అర్థం చేసుకొంది. అలాగే జన్మభూమి తాలూకు సంక్రమించిన, పరిశుభ్రత, విశాలత సరళతలను కూడా ఆమె [illegible] పరుచుకొన్నది. పరస్పర విరుద్ధమైన ఈ ద్వివిధ ప్రకృతులకూ నిలయమైన ఈ 'తల్లి'ని చూచి శేఖర్ చాలా గర్వపడుతుండేవాడు. కొడుకు తనను చూసి ఇలా మురిసి పోతుంటాడన్న విషయం భువనేశ్వరికి తెలియదు. భగవంతుడు శేఖరునికి చాలా ప్రసాదించాడు. వాటి పట్ల అతనికి అచంచలమైన గౌరవం ఉన్నది. కాని, ఎక్కడనో, ఏ అదృష్టవంతులకో తప్ప లభించని మరో మహాసిరి 'తల్లి'ని కూడా భగవంతుడు అతని కిచ్చాడు. అది, భువనేశ్వరి అతనికి మాతృమూర్తి కావడం!

'బాగుంది—అని ఊరుకొన్నావేం నాయనా!' అన్నది భువనేశ్వరి.

'నువ్వడిగిన దానికి సమాధానం చెప్పాను గదా అమ్మా!' అన్నాడు శేఖర్ నవ్వుతూ తలవంచుకొని.

భువనేశ్వరి నవ్వి ఇలా అన్నది:

'శేఖర్! సమాధానం ఎక్కడ చెప్పావురా?... పిల్ల రంగెలా ఉంటుంది? పచ్చగా, ఉంటుందా? ఎవరిలాగా ఉంటుందో చెప్పు! . మన లలితలాగా ఉంటుందా!' అని ప్రశ్నించింది తల్లి.

'లలిత [illegible]గా ఉంటుందమ్మా! ఆ పిల్ల మన లలిత కన్నా ఎర్రగా ఉంటుంది!'

'ముక్కు, ముఖం.. ?'

'ఫర్వాలేదు'

'అయితే పిల్ల నీకు నచ్చిందని మీ నాన్నగారితో చెబుతాను.'

శేఖరుడు మాట్లాడ లేదు.

భువనేశ్వరి కొడుకు వేపు చూస్తూ, ఏదో జ్ఞప్తి కొచ్చిన దానిలా అన్నది: 'అన్నట్లు—పిల్ల ఏమన్నా చదువుకొన్నదే నా శేఖర్?'

'ఏమో మరి! ఆ మాట నేనూ అడగ లేదు.' అన్నాడు.

తల్లి ఆశ్చర్య పోయింది.

'అదేమిట్రా? అడక్కుండా ఎలా వచ్చావ్? ఈ కాలపు పిల్లలు ముఖ్యంగా చూసేది చదువే గదా! నువ్వా ప్రశ్నే వేయలేదెందు కనిరా!'

'ఆ సంగతి నాకు జ్ఞాపకమే లేదమ్మా!' అన్నాడు శేఖర్ నవ్వుతూ.

భువనేశ్వరి మరింత ఆశ్చర్య పడ్డది. కొడుకు ముఖంలోకి ఓ క్షణ కాలం చూసి అన్నది: 'శేఖర్! ఆ పిల్లను నువ్వే చేసుకోవను కుంటాను!'

శేఖరుడేదో చెప్పబోయాడు. లలిత గదిలో కొచ్చింది. భువనేశ్వరి, ఆ పిల్లను దగ్గరకు తీసుకొంటూ 'ఏమిటమ్మా లలితా?' అన్నది ఆప్యాయంగా.

'ఏమీ లేదమ్మా' అన్నది లలిత ముక్తసరిగా. ఇదివరకు లలిత 'పిన్నీ' అని పిలిచేది భువనేశ్వరిని. భువనేశ్వరే వారించి 'లలితా నేను పిన్నిని కాదమ్మా! తల్లిని' అని సవరించింది. ఆనాటి నుండీ లలిత 'పిన్నీ' అని పిలవడం మానేసి 'అమ్మా' అనే పిలుస్తున్నది భువనేశ్వరిని. లలితను మరింత దగ్గరకు తీసుకొని, 'ఏమీ లేదా లలితా? అయితే నన్నొక సారి ఉత్తినే చూసి పోదామని వచ్చావన్నమాట' అన్నది భువనేశ్వరి సాదరంగా.

లలిత మాట్లాడ లేదు.

'చూడడాని కొచ్చింది సరే—బావుంది—మరి వంట పనెప్పుడు చేస్తుంది?' అన్నాడు శేఖర్.

'లలిత వంటపని చెయ్యాడ మేమిట్రా బాబూ!' అన్నది భువనేశ్వరి.

'మరి వారికి వండి పెట్టే దెవరమ్మా? ఆనాడు బాబాయి గూడా నాతో అన్నాడే! వంట పనులన్నీ లలితే చేస్తున్నదనీ!' ఆశ్చర్యపోతూ అన్నాడు.

తల్లి నవ్వుతూ అన్నది: 'లలిత మామ గారెప్పుడూ అలానే అంటుంటాడు. ఆ మాటలకు అర్థం పర్థం ఉండదు. లలిత కింకా పెళ్ళి కాలేదు గదా! అది వంట చేస్తే పనికొస్తుందటరా? మన వంట వాణ్ణి పంపించాను. వాడే అక్కడ వండుతాడు. నేనూ గూడా వారింటి దగ్గరే భోంచేసి వస్తున్నాను రెండు పూటలా' అన్నది తల్లి.

తన తల్లి ఒక నిరుపేద కుటుంబ సంరక్షణ భారాన్ని వహించిందని గ్రహించి తృప్తిగా నిట్టూర్చాడు శేఖరుడు.

నెలరోజులు గడిచాయి. ఒక నాటి సాయంకాలం ఏదో ఇంగ్లీషు నవలా పఠనంలో మునిగిపోయున్నాడు శేఖరుడు. లలిత వచ్చి, దిండు క్రింద నుండి తాళపు చెవులు తీసుకొని, బీరువా తెరిచింది. శేఖరుడామెకేసి చూడకుండానే 'ఏమిటది?' అన్నాడు.

'డబ్బు కావలసి—తీసుకొంటున్నాను' అన్నది లలిత.

'ఊఁహూఁ'

శేఖరుడు మళ్లీ చదువు కొంటున్నాడు. లలిత డబ్బును, కొంగున కట్టుకొని అక్కడే నిలబడింది. ఆమె ఈ రోజు ప్రత్యేకంగా అలంకరించుకొని వచ్చింది. తన అలంకరణను శేఖరుడు చూడాలని ఆమె అభిలాష. అతనేమో, పుస్తకం నుండి ముఖం మెత్తడం లేదు. ఎలాగైనా అతని కంట తను పడాలనుకొని లలిత అన్నది:

'శేఖర్ దా! పది రూపాయలు తీసుకొన్నాను!'

'మంచిది.'

ఈ సారి గూడా తలెత్తకుండానే అన్నాడు శేఖర్. ఆమె ఈ ప్రయత్నం గూడా ఫలించక పోవడంతో, ఏమీ తోచక, అటూ ఇటూ తచ్చాడింది. అయినా శేఖరుడు చూడలేదు. నిరాశతో లలిత బైటికి వెళ్లింది. కానీ కాళ్ళు కదలడం లేదు. తిరిగివచ్చి, తలుపు వెనక నిలబడి శేఖర్ వైపు చూసింది. లాభంలేదు. అతగాడిటు తిరగనన్నా తిరగలేదు.

ఆమె ఇవ్వాళ నాటకానికి వెళ్లాలను కొన్నది. శేఖరుని అనుజ్ఞ పొందడం కోసరమే ఇప్పుడొచ్చింది. అనుమతి లేనిదే తానెక్కడికీ వెళ్ళదు. వెళ్ళలేదు, ఎందుకు చెప్పాలనీ, చెప్పకపోతే, కొంపమునిగే

దేమిటనే ప్రశ్నలకు తావులేదు. అలా అనుమతి లేకుండా వెళ్ళరాదని ఆమె కెవ్వరూ నూరి పొయ్యలేదు గూడాను. ఇతరులు యథేచ్ఛగా, వెడ తారు. కాని తనావిధంగా చెయ్యలేదు. తనకు మామా అత్తయ్యల అను మతి మాత్రమే కాదు. శేఖరుని అనుజ్ఞ గూడా కావాలి.

'మేము నాటకం చూడడానికి వెళుతున్నాం శేఖర్ దా!' అన్నది లలిత తలుపు చాటున నుంచుని.

ఆమె మృదు స్వరం, శేఖరుని దాకా రాలేదు.

'అందరూ నా కోసం ఎదురు చూస్తున్నారు.' అన్నది లలిత గొంతు మరి కాస్త పెద్దది చేసి.

'ఏమిటో?' అన్నాడు శేఖర్, పుస్తకం ఒక ప్రక్కగా పెట్టి.

'ఇప్పటిగ్గానీ మీరు వినపడలే దన్నమాట!' అన్నది లలిత కోపంతో, 'మేము నాటకానికి పోతున్నాం'

'మేమంటే?' అన్నాడు శేఖర్.

'నేను, అన్నాకాళీ, చారు బాల, వాళ్ళ మామ —'

'మామగా రెవరు?'

'ఆయన పేరు గిరీన్ బాబు. అయిదారు రోజుల క్రిందట ముంగేరు నుండి ఇక్కడికొచ్చారు. ఇక్కడే బి. య్యే. చదువుతారు. చాలా మంచివాడు-'

'ఓహో! ఊరు, పేరు... సంభాషణ చాలా జరిగిందన్న మాట. అందుకే నేనా తమరు నాలుగు రోజుల్నుండీ దర్శన మివ్వంది? అయితే-పేకాట జోరుగా సాగుతున్నదన్న మాట. అవునా?'

శేఖరుని ధోరణి చూసి లలిత భయపడింది. ఇలాంటి ప్రశ్నలు శేఖరుడు వేస్తాడనీ, వాటికి తను జవాబివ్వ వలసి వస్తుందనీ, లలిత ఊహించ లేదు. ఈ హఠాత్సంఘటనకు ఆమె రిచ్చ పడ్డది.

'పేకాట బాగా సాగుతోంది కదూ?'

లలిత ఓ గుటక చేసి 'చారు చెప్పిందనే ఆడాను.' అన్నది మెల్లగా.

'చారు చెప్పడమా? ఏమని?' అన్నాడు శేఖరుడు ఆమె వంక చూసి. 'చీర సింగారించుకొని కూడా వచ్చావుగా. సరే వెళ్ళు.'

లలిత వెళ్ళలేక, అక్కడే నిలుచుంది.

చారు బాల పొరుగు వారి పిల్ల. లలిత స్నేహితురాలు. దాదాపు ఇద్దరూ ఒకే ఈడు వారు. వారు బ్రహ్మ సమాజికులు. ఈ గిరీన్ బాబును తప్ప, మిగతా వాళ్ళందరూ శేఖరుడికి తెలుసు. అయిదారు సంవత్సరాల క్రిందటనేమో, గిరీన్ ఒకసారి ఇక్కడికి వచ్చాడు. ఇంతకాలమూ బంకింపూరులో ఉంటున్నాడు. ఇప్పటివరకూ కలకత్తా రావలసిన అవసరం లేక పోవడంతో, రాలేదు. అందుకే శేఖరుడు గిరీన్‌ను ఎరుగడు.

లలిత ఇంకా అలాగే నిలబడి ఉన్నది.

'ఊరికే ఎందుకలా నిలుచున్నావ్ లలితా! వెళ్ళు!'

అయిదారు నిముషాల పాటు. అలా స్తబ్ధుగా నిలబడింది లలిత. తరువాత మెల్లగా, 'వెళ్ళనా?' అని అడిగింది మళ్ళా.

'ఇందాక నే వెళ్ళమని చెప్పానుగా!'

ఈ విసురు చూపు చూసిన లలితకు, నాటకం చూడాలన్న ఇచ్ఛ నశించింది. కానీ పోకుండా ఉండటానికి వీలు లేదు. సగం ఖర్చు తను పెట్టేటట్లు, మిగతా సగం ఖర్చు గిరీన్ బాబు పెట్టుకొనేటట్లు ఒప్పందాలు జరిగాయి.

క్రింద తన కోసం చారూ వగైరాలు కనిపెట్టుకొని ఉంటారు. ఇక్కడేమో, అనవసరంగా కాలం గడిచి పోతున్నది. వారక్కడ తన కోసం ఆదుర్దా పడుతుంటారని తెలుసు కానీ చేయగలిగిందేమీ లేదు. అతని అనుజ్ఞ లేకుండా వెళ్ళడమనేది జరగదు. జరగడానికి వీలులేదు. అలా చేయగలిగిన సాహసం తనకు లేదు. కాసేపు గడిచాక మళ్ళ ప్రాధేయ పూర్వకంగా అడిగింది లలిత! 'వెళ్తాను. ఈ ఒక్క రోజుకే-మళ్ళా...'

'నన్నాట్టే విసిగించబోకు లలితా!' అన్నాడు శేఖర్ చేతిలో ఉన్న పుస్తకాన్ని గిరవాటేసి. 'నీ యిష్టం. వెళ్ళాలనుకొంటే వెళ్ళు. లేక పోతే మానెయ్యి. అంతేగానీ, నన్ను నస పెట్టకు. ఏది మంచో, ఏది చెడ్డో నీకు నేను చెప్పను. ఆ జ్ఞానం గుర్తించే వయస్సు నీకున్నది.'

ఉలిక్కి పడ్డది లలిత. ఇలా ఇతని చేత చీవాట్లు తినడం ఇవ్వాళే మొదలు కాదు. ఇది తమ మధ్య అను నిత్యం జరిగే 'రసమయ' గాథ లాంటిది. కానీ గత రెండు మూడు సంవత్సరాలలో, శేఖరు డేనాడూ ఇంత తీవ్రంగా మాట్లాడి ఎరుగడు. అక్కడా-వారందరూ తన కోసం ఎదురు చూస్తుంటారు. ఇక్కడా, తను ఇలాంటి చిక్కుల్లో పడిపోయింది. వారి దగ్గర కెలా వెళ్ళగలదు తను? వెళ్ళి ఏ ముఖం పెట్టుకొని ఏమని సమాధానం చెబుతుంది?

మరో చోటికి రాక పోకల విషయంలో లలితకు సర్వస్వాతంత్ర్యాలూ ఇచ్చాడు శేఖరుడు. ఇంత వరకూ ఆ స్వాతంత్ర్యాల కెలాంటి భంగమూ రాలేదు. కనుకనే లలిత సర్వం సిద్ధం చేసుకొని అనుమతి కోసం శేఖరుని వద్ద కొచ్చింది.

అనుమతి లభించ లేదు. తనకున్న స్వాతంత్ర్యం, చేజారి పోయింది. పోవటమే కాకుండా, అలా పోవడానికి గల కారణం, ఎంత లజ్జాకరమైనదో, ఈ పదమూడవ సంవత్సరం ఆమెకు స్పష్ట పరిచింది. ఆమె కళ్ళు నీటితో నిండాయి. అయిదారు నిముషాల పాటు అలానే నిలబడి, కళ్లు తుడుచుకొంటూ, తన గదికి వెళ్ళింది. అన్నాకాళిని పిలిచి, తన కొంగునున్న పది రూపాయల నోటు ఆ పిల్ల చేతికిస్తూ అన్నది: 'నా వంట్లో ఏమీ బాగుండ లేదు కాళీ! ఈ రోజుకు మీరందరూ వెళ్ళి చూసిరండి. నేను రాలేనని వారితో చెప్పు?'

'అదేమిటి లలితా? ఎందుకు బావుండ లేదు?' అన్నది అన్నాకాళి.

'తల నొచ్చుతోంది. వొళ్ళంతా పచ్చి పుండుగా ఉంది. చూసే వోపిక లేదు. మీరు వెళ్ళిరండి!' అని పడుకొంది లలిత. చారు బాల వచ్చి ఎన్నోవిధాల బ్రతిమ లాడింది. అత్తయ్య చేత చెప్పించింది. లలిత విన లేదు. తను రాననీ, రాలేననీ, ఒంట్లో బాగుండక పోవడమే అందుకు కారణమనీ, తెగేసి చెప్పింది. పది రూపాయలూ చేతిలోపడ్డప్పట్నుంచీ, అన్నాకాళి కాళ్ళు నిలవడం లేదు. ఈ గొడవల్లో పడి, అసలు నాటకానికి వెళ్ళడమే కుదరదేమోనని చాలా భయపడిం దా పిల్ల. చారుబాలను చాటుకు పిల్చి, 'చారూ! లలితకు ఒంట్లో ఏమిటోగా ఉండి రాలేనంటున్నది. నా చేతికి డబ్బిచ్చింది. ఇదిగో—నా మాట అబద్ధమను కొంటే

చూసుకో... ఇంకా ఇక్కడే తాత్సారం చెయ్యడం దేనికి చారూ? మన మన్నా వెడదాం రా రాదూ?"

వయస్సు చిన్నదన్నమాటే గానీ, అన్నాకాళీ ఆలోచనలు మాత్రం చిన్నవి గావను కొన్నది చారు బాల. అన్నాకాళీ చేసిన సూచన చాలా బావుంది గనక, గానినే ఆవరణలో ప్రత్యేంగుకు వెళ్లి పోయింది పిల్ల.

# 3

ప్రపంచంలో ఎన్నో రకాల మనుషులున్నారు. ఒక్కొక్కరి కొక్కొక్క రకమైన అభిరుచు లుంటాయి. చారు బాల తల్లికి పేకాటట మంటే మహా ఇష్టం. కూడూ నీళ్ళూ మానుకొని, గంటల తరబడి ఆడమన్నా ఆడ గలదు. కానీ విజయాన్ని చేపట్ట డానికి, ఒక్క ఓర్పే చాలదు. చేసే పనిలో నైపుణ్యం గూడా ఉండాలి. దురదృష్ట వశాత్తూ, మనోరమకీ పేకాటలో నైపుణ్యం లేదు. ఈ లోపాన్ని సరిదిద్దు కోడానికి ఆమె తరచుగా లలిత సాయాన్ని కోరుతుండేది. లలితకు ఈ ఆటలో మాంఛి ప్రావీణ్య మున్నది. మనోరమ పినతల్లి గారి పుత్రుడు గిరీన్ బాబు ఇక్కడి కొచ్చినప్పటి నుండీ, మధ్యాహ్న వేళలలో పేకాట బ్రహ్మాండంగా సాగి పోతున్నది. గిరీన్ బాగా ఆడతాడు. అతనితో సమానంగా ఆడగల నేర్పు ఒక్క లలితకే ఉన్నది. అందుకే గిరీన్‌కు ప్రత్యర్థి గా తరచు లలితను కూర్చో బెడుతుండేది మనోరమ. అప్పటిగ్గానీ ఆట రక్తి కట్టదు.

నాటకం గొడవ జరిగిన మరునాడు, మామూలుగా పేకాటకు లలిత హాజరు కాక పోవడం చేత, దాసీ చేత కబురు పంపింది మనోరమ. ఆ సమయాన, ఏదో ఓ పెద్ద ఆంగ్ల నవలకు, వంగానువాదాన్ని చదువు తున్నది లలిత. ఆమె వెళ్ళ లేదు.

లలితను పిలుచు కెళ్లేందుకు గాను చారు బాల వచ్చింది. చాలా ప్రయత్నించి గూడా సఫలీ కృతురాలు కాలేక పోయింది. చివరకు స్వయంగా మనోరమ వచ్చింది. చదువుతున్న పుస్తకాన్ని లలిత చేతిలో నుండి లాగి పారేసింది. 'ఇక లేవమ్మా లలితా! చదివి చదివి నువ్వో జడ్జి

పని చెయ్యబోవడం లేదు కదా! లేచిరా. నువ్వు లేక పోతే ఈ పూట పేకాటకు రుచి తప్పి పోతుంది.'

లలిత మాంఛి ఇరకాటంలో పడింది. ఒక వంక మనోరమ బలవంత పెడుతున్నది. మరో వంక శేఖర్ దా పెట్టిన ఆంక్ష భయంకరంగా కనిపిస్తున్నది. లలితకేమీ పాలుపోక, కళ్లంట నీళ్లు పెట్టుకొన్నది.

'నేనీ పూట రాలేను మనోరమా! నన్ను మన్నించు. రేపు తప్పకుండా వస్తాను.' అన్నది లలిత.

అయినా మనోరమ వినలేదు. చివరికి లలిత అత్త చేత చెప్పించి తనతో బాటు తీసుకెళ్లింది. ఉత్సాహం లేక పోవడం మూలాన, ఆ నాటి ఆట, ఆట్టే 'రంజు'గా లేదు. కూచున్నంత సేపూ, ముళ్లమీద కూచున్నట్టు కూచుని, వేళ కాగానే, లేచి పోయింది. పోయేటప్పుడు గిరీన్ ఇలా అన్నాడు:

'రాత్రి మీరు పంపిన డబ్బు అందింది గానీ, మేము కూడా నాటకానికి వెళ్లలేదండీ! రేపు రండి! తప్పకుండా వెడదాం!'

'లాభం లేదు.' అన్నది లలిత తల అడ్డంగా తిప్పుతూ. 'నా వంట్లో ఏమీ బాగో లేదు.'

గిరీన్ నవ్వుతూ 'ఇప్పుడు వంట్లో బాగానే ఉన్నదను కొంటాను. ...రేపు వెడదాం. సరే నాండి?' అన్నాడు.

'ఊఁహు...రేపు కూడా రాలేను. ఎందుకంటే, రేపు నాకు చాలా పనులున్నాయి.'

ఈ మాటలని, అక్కడో క్షణమైనా నిలబడకుండా గబగబా వెళ్లి పోయింది లలిత. ఇలా, ప్రతి దానినీ కాదనడము, ఆటపట్ల ఆసక్తిని చూపక పోవడము, శేఖర్ దా ఆజ్ఞ వల్ల నేనని అనలేము. దాని ప్రభావం కొంత ఉన్న మాట నిజమే! కాని పూర్తిగా అదే కారణం కాదు. ఆమె స్వతహాగా చాలా సిగ్గుపడే తత్వం గల మనిషి.

మనోరమ గారింటికి రావడం లలితకు క్రొత్తేమీ కాదు. శేఖర్ ఇంటికి, స్వేచ్ఛగా రాక పోకలు సాగిస్తున్నట్టే, వారింటికి కూడా సాగిస్తుంది. ఈ ఇంటి వారితో ఉన్నంత పరిచయం, వారితోనూ ఉంది. గిరీన్ ఎదుట తొలిసారిగా ఆమె తిరగవలసి వచ్చినప్పుడు, లలిత సిగ్గుపడ లేదు.

భయపడ లేదు. ఇన్నాళ్లుగా లేని ఈ సిగ్గు భిడియాలు ఈనాడు కలిగాయి. ఈ రోజు గిరీన్‌కు ఎదురుగా పేకాట ఆడుతున్నంత సేపూ, ఆమె ప్రాణాలు గిల గిల లాడి పోయాయి. గిరీన్‌కూ తనకూ నిజమైన పరిచయం కలిగి ఎంతో కాలం కాలేదు. కానీ ఈ స్వల్ప కాలంలోనే, అతను తన వేపు ప్రేమ దృక్కులు ప్రసరిస్తున్నాడని లలిత తెలుసుకొంది. పురుషుల ప్రణయం, ఇంత లజ్జాకరంగా ఎందుకుంటుందో ఆమె అర్థం చేసుకోలేక పోయింది.

లలిత ఇంటికి వెళ్ళి కనిపించింది. తరువాత శేఖరుని గదిలో ప్రవేశించింది. ఆ గది తాలూకు బాధ్యతలన్నీ ఆమెవే! చిన్నదీ చితకదీ అన్న భేదం లేకుండా, ఈ గదిలోని పనులన్నీ లలితే చేస్తుండేది. పనులన్నీ అంటే—విరగబడి చేసే వేమీ లేవు. చిందరవందరగా ఉన్న పుస్తకాలను సర్దడం, టేబిలును శుభ్రపరచడం, సిరాబుడ్డి, కలాలను, తుడిచి, ఒబ్బిడిగా, యథాస్థానంలో ఉంచడం, లాంటి పనులు లక్షా తొంభై చేస్తుంది లలిత. ఈ పనులన్నీ లలిత చెయ్యవలసిందే గానీ, మరొకరు ముట్టుకోరు. గత నాలుగైదు రోజుల నుండీ, శ్రద్ధ తీసుకోక పోవడం వలన, బోలెడంత పని పేరుకు పోయింది. శేఖరు రాక పూర్వమే వీటన్నింటినీ తీర్చిదిద్దా లనుకొన్నది లలిత.

భువనేశ్వరిని 'అమ్మా!' అని పిలుస్తుంది లలిత. తన తీరిక కాలాన్నంతా, ఇక్కడే గడిపి వేస్తుందామె. ఈ ఇంటి వారు తన వారు కాదన్న ఊహ లలిత కేనాడూ పొడసూపలేదు. ఆ యింటి వారికి గూడా లలిత పరాయిదన్న ఆలోచన రాలేదు. ఆమె తలిదండ్రులు చనిపోయి, మేనమామ గారింటికొచ్చినప్పటి నుండీ, శేఖరుని వెంట, ఓ తోబుట్టువులా మసలింది. అతని వద్దనే చదువు సంధ్యలు నేర్చింది. ఇంతదయింది.

లలిత పట్ల శేఖర్ బాబుకు చాలా సదభిప్రాయమున్నది. ఆమె అంటే ఎంతో అభిమానాన్ని ప్రదర్శిస్తుండే వాడు. ఇందుకు కారణమేమిటో ఎవ్వరికీ తెలియదు. చిన్నతనం నుండీ, ఒకే విధంగా లలితను ఆదరిస్తూ వచ్చాడు శేఖర్ బాబు. ఈనాటి దాకా, అది ఎవ్వరినీ ఆకర్షించ లేదు. ఎవ్వరికీ ఎబ్బెట్టుగా తోచనూ లేదు. ఒక నాటి కామె ఆ యింటి కోడలు కాగలదని ఏ ఒక్కరూ భావించ లేదు. లలిత సరే-ఆమె అత్త మామలు గూడా అలా కలగన్న పాపాన పోలేదు.

త్వరితంగా ఆ గదిలోని పని ముగించుకొని, వెళ్ళి పోదామను కొంది లలిత. కాని పరధ్యానంగా ఉండడం చేత గడియారం కేసి చూడ లేదు. ఉన్నట్టుండి, గది ముందు బూట్ల చప్పుడు వినిపించింది. లలిత ముఖ మెత్తి చూసి, ప్రక్కకు తప్పుకొన్నది.

'లలితా!' అన్నాడు శేఖరుడు సోఫాలో కూర్చుంటూ. 'నిన్న ఇంటికి వెళ్ళే సరికి, ఎంత రాత్రయింది మీకు!' అన్నాడు.

లలిత జవాబివ్వ లేదు.

శేఖరుడు సోఫాలో జారగిల బడ్డాడు.

'ఎంత ప్రొద్దు పోయింది లలితా! రాత్రి రెండయిందా? మా డింటికి వొచ్చావా? ..ఏం? అలా నోరు మూసుకొన్నావేం? మాట ఊడి పడనియ్!'

లలిత పెదవి కదపకుండా అలానే నిలుచున్నది.

'సరే! క్రింద నిన్ను అమ్మ పిలుస్తున్నది!' అన్నాడు శేఖరుడు విసుగెత్తి.

భువనేశ్వరి భాండాగార గృహం ముందు కూచుని ప్లేట్లలో ఫలహారాల సమర్పిస్తోంది.

'పిలిచావా అమ్మా?' అన్నది లలిత, భువనేశ్వరికి దగ్గరగా వచ్చి.

'నేనా? పిలవ లేదే!' అన్నది భువనేశ్వరి ముఖమెత్తి లలిత కేసి చూస్తూ. 'ఇదేమిటి లలితా? ముఖమంతా అదోలా ఉన్నదేమమ్మా? ఇంత వరకూ ఏమీ తినలేదనుకొంటాను. అవునా అమ్మా?'

లలిత తల ఆడించింది.

'సరే!' అన్నది భువనేశ్వరి. 'ఈ ఫలహారం తీసుకెళ్ళి శేఖర్ బాబు కిచ్చిరా. వెళ్ళు.'

లలిత పళ్ళెం పుచ్చుకొని, మేడ మీదికి వొచ్చింది. శేఖరుడింకా కళ్ళు మూసుకొని పడుకొనే ఉన్నాడు. ఆఫీసు డ్రస్సుగూడా విడువ లేదు. లలిత మెల్లగా 'ఫలహారం తీసుకొచ్చాను' అన్నది దగ్గరగా వచ్చి.

'అక్కడ పెట్టి పో.' అన్నాడు శేఖరుడు కళ్ళు తెరవకుండానే.

కోప పడటం ఎందుకు జరగాలో, లలిత కర్థం కాలేదు. ఈ 'గిలి'ని మనస్సులో ఉంచుకొని, నాలుగైదు రోజులపాటు శేఖరుని తప్పించుకొని తిరిగింది లలిత. అయినా, ఆ గది తాలూకు పనులు చేస్తూనే ఉంది. తను చేసిన పొరబాటును శేఖరుడు గమనించాడు. రెండవ రోజున లలితకు కబురు చేశాడు. అయినా లలిత రాలేదు.

అప్పుడప్పుడొక ముసలి భిక్షువు, ఆ వీధి కొస్తుండేవాడు. ఆ బిచ్చగాడంటే లలిత కెంతో జాలి. కనిపించినప్పుడల్లా, ఓ రూపాయి వాడికి ఇస్తుండేది లలిత. రూపాయి ఖంగున చేతిలో పడగానే, చిత్రాతిచిత్రమైన దీవన లిచ్చేవాడా బిచ్చగాడు. అవన్నీ వినడమంటే లలిత కెంతో ఇష్టం! లలిత-పూర్వ జన్మలో ఆ బిచ్చగాడికి కన్న తల్లిట. ఆ విషయం—లలితను చూడంగానే వాడికి స్ఫురించిందిట. ఆ ముసలి కొడుకు, ఈనాడు గూడా, వచ్చాడు. వస్తూనే 'మా అమ్మ ఏదీ?' అని ప్రశ్నించాడు.

తన ముసలి కొడుకు కంఠస్వరం, లలిత విన్నది. పూర్వంలా, ఉత్సాహంగా వాడి దగ్గర కెళ్ళ లేక పోయింది. శేఖరుడింకా ఇంట్లోనే ఉన్నాడు. ఆ 'బిడ్డ' కివ్వడానికి రూపాయి ఏది మరి? అత్త నన్నా అడిగి తెద్దామనుకొన్నది లలిత. కానీ ఇప్పటి దాకా దాసీ దానితో పోట్లాడిన అత్తయ్య. ఇప్పుడే పొయ్యి ముందు కూలబడింది. ఈ పరిస్థితిలో అత్తయ్యను డబ్బడగడం భావ్యంగా ఉంటుందా? ఉన్నా ఉండక పోయినా అసలు ఇస్తుందా? జ్ఞాడ వీధ్లేకి మానింది. బిచ్చగాడు కర్ర గోడకు ఆనించి అక్కడే చతికిల బడ్డాడు. ఇంతకు ముందెప్పుడూ వాణ్ని ఉత్త చేతులతో పంపించ లేదు. ఇవ్వాళ అలా పంపించడాని కామె మనస్సంగీకరించ లేదు.

బిచ్చగాడు 'అమ్మా!' అని పిలిచాడు.

'వస్తున్నా!' అంటూ అన్నకాళి పరుగెత్తు కొంటూ వచ్చింది. 'మీ అబ్బాయి గారొచ్చారు!'

'కాళీ!' అని ఆప్యాయంగా పిలిచింది లలిత. 'ఒక చిన్న పనిచేసి పెట్టమ్మా! శేఖర్ బాబు దగ్గర కెళ్ళి ఓ రూపాయి పట్టుకురా.'

అన్నాకాళి పరుగెత్తుకొంటూ వెళ్లి రూపాయి తీసుకొచ్చింది.

'శేఖర్ బాబుగారు ఏమన్నా అన్నాడా?' అన్నది లలిత రూపాయి నందుకొంటూ.

'అహా...ఏమీ అనలేదు వదినా! చొక్కా జేబులో ఉంది-తీసుకెళ్లమన్నాడు.'

'ఇంకేమీ అనలేదు గదా?'

'అబ్బే! నీతో నేను అబద్ధం చెబుతానా వదినా? ఇంకేమీ అనలేదు.'

'సరే!'

అన్నాకాళి ఆడుకోవడానికి వెళ్ళిపోయింది. లలిత కూడా బిచ్చగాణ్ణి పంపివేసింది. కానీ లోగడలాగా ఈనాడు కూడా అతని అపూర్వ దీవనలను పొందలేదు. వినను కూడా వినలేదు. అలా వినడమంటే —ఆమె కిష్టం లేకుండా పోయింది.

ఇటీవల పేకాట బ్రహ్మాండంగా సాగుతోంది. ఈ రోజు మధ్యాహ్నం లలిత అక్కడికి వెళ్లలేదు. తల నొప్పిగా ఉన్నదని ముసుగు పెట్టుకొని పడుకొన్నది. ఇది అబద్ధం కాదు; ఇవ్వాళ నిజంగానే లలిత మనస్సు మనస్సులో లేదు. సాయంకాలం అన్నాకాళీని పిలిచి లలిత ఇలా అన్నది: 'కాళీ! శేఖర్ బాబు దగ్గర చదువుకోవడానికి నువ్వెళ్ళడం లేదుటే?'

'ఎందుకు వెళ్ళడం లేదూ?'

'నా సంగతేమన్నా అడుగుతున్నాడా కాళీ?'

'లేదు వదినా! అహా-కాదు కాదు.. మొన్నోసారి అడిగాడు... నువ్వు మధ్యాహ్నం పూట పేకాడడానికి పోవడం లేదా?'

'నువ్వా సంగతి చెప్పావా ఏమిటి కాళీ?' అన్నది లలిత ఉద్విగ్న హృదయంతో.

'నువ్వు మధ్యాహ్నమప్పుడు, చీట్లాట ఆడడానికి చారుదీదీ గారింటికెడుతున్నావుగా! ఆ మాటే చెప్పాను. ఎవరెవరు కలిసి ఆడుతుంటారని నన్నడిగాడు. నువ్వు బాగా ఆడతావా? చారు మామ బాగా ఆడతాడా? నువ్వే బాగా ఆడగలవంటోంది మనోరమ.'

'నువ్వీసంగతులన్నీ ఎందుకే చెప్పావే కాళీ!' అని మండి పడ్డది లలిత. 'లోకంలో ఉన్న అన్ని గొడవలూ నీకే కావాలి. అప్పుడే పెద్ద ఆరిందా వయ్యావన్న మాట. సరే, జ్ఞాపక ముంచుకో... ఇక నీకెప్పుడూ, ఏమీ ఇవ్వను...'

కాళి నిశ్చేష్టయింది. లలిత—ఇర్లిత ఆకస్మికంగా ఎందుకు మారి పోయిందో, ఆ పిల్ల కర్థం కాలేదు.

రెండు రోజుల నుండీ పేకాట జరగడం లేదు. లలిత 'ఆకళామయ కార్యక్రమం'లో పాల్గొనడం లేదు. లలితను చూసి నవ్వుతున్నంచీ, గిరీన్ ఆమెపట్ల ఆకర్షితుడయినాడని మనోరమ అనుమానిస్తూ వచ్చింది. ఆ అనుమానం ఈనాడు మరింత బలపడింది.

ఈ రెండు రోజుల నుండి గిరీంద్రుడు కాలుగాలిన పిల్లిలా అయి పోయినాడు. అన్యమనస్కత అధికమైంది. ఊరికే గదులన్నీ, దేనికోసమో వెతుకుతుండే వాడు. ఈ రోజు మధ్యాహ్నం మనోరమ దగ్గర కొచ్చి, 'అక్కా! ఇవ్వాళ కూడా పేకాట లేనట్లే గదూ?' అన్నాడు.

'ఎట్లా ఉంటుంది గిరీన్? ఉన్నది ముగ్గురమే నాయె! పోనీ, మన ముగ్గురమే ఆడుకొందామా?' అన్నదామె.

'ముగ్గురితో ఆట—అబ్బే. బావుండదక్కాయ్! చక్కగా, నలుగురమూ కలిసి ఆడుకోవచ్చు, వాళ్ళ లలితను పిలిపించ కూడదూ?'

'లలితనా? లాభంలేదు తమ్ముడూ! లలిత రాదు.'

గిరీంద్రుడు ఆశ్చర్యపోయాడు 'ఏం? ఎందుకని రాదక్కయ్యా? వాళ్ళ వాళ్ళు, మనింటికి రావద్దని చెప్పారా లలితతో?' అన్నాడు.

'లేదు గిరీన్' అన్నది మనోరమ అనంగీకార సూచకంగా తలతిప్పి. 'వాళ్ళ వాళ్ళలాంటి వాళ్ళు కారు. ఆమే ఎందుకనో రావటం లేదు.'

'అయితే అక్కయ్యా! నవ్వోసారి వెళ్లి పిలుచుకురా. నువ్వెడితే తప్పకుండా వస్తుంది!' అన్నాడు గిరీన్ బాబు ఉత్సాహంతో.

'సరే! నీ మాట నెందుకు కాదనాలి! అలాగే వెడతాను' అన్నది మనోరమ నవ్వుతూ.

గిరీంద్రుడన్న మాట అక్షరాలా నిజమయింది. మనోరమ వెళ్లి లలితను వెంట తీసుకొచ్చింది.

గత రెండు రోజుల నుండీ ఆడకి పోవడం చేత, ఈ రోజు ఆట చాలా రక్తి కట్టింది. లలిత పక్షమే విజయం పొందుతూ ఉన్నది.

రెండు గంటలు గడిచాయి. అన్నా కాళీ పరుగెత్తు కొంటూ వచ్చి 'వదినా! నిన్ను శేఖర్ బాబు పిలుస్తున్నాడు.' అన్నది.

ఆ మాట వినడంతో, లలిత ముఖం ఎలా తెలా పోయింది. చేతుల్లోని పేక ముక్కల నక్కడ పడేసి 'కాళీ! శేఖర్ దా ఇంకా ఆఫీసు కెళ్ళ లేదుటే?' అన్నది.

'ఏమో! నాకు తెలియదు వదినా! వెళ్లి వచ్చాడను కొంటాను!' అన్నది అన్నా కాళీ.

'పిన్నీ! వెళ్ళొస్తాను' అన్నది మనోరమ కేసి చూస్తూ లలిత.

మనోరమ ఆమె పోకుండా చేయి లంకించుకొని 'అదేమిటే లలితా? ఇంకో రెండు వరుసలు ఆట తిరగంగనే వెళుతావా?' అన్నది.

'ఆఁ. వెళ్ళాలి పిన్నీ! నన్ను బలవంత పెట్టకు. వెళ్ళక పోతే, వారికి కోపమొస్తుంది!' అన్నది లలిత.

'శేఖర్ దా అంటే, ఎవరో నీకు తెలుసా అక్కాయ్?' అన్నాడు గిరీంద్రుడు, లలిత వెళ్ళాక.

'ఆఁ. అదేమిరా, ఎదురుగా ఆ పెద్ద మేడ లేదూ? వారబ్బాయి'

'ఓహో ఆ యిల్లా నువ్వన్నది! నవీన బాబు వారికి బంధువుగూడా కదూ?'

మనోరమ ఒకసారి కూతురు ముఖం కేసి చూసి చిరునవ్వు నవ్వింది. 'బంధు వేమిట్రా నా ముఖం? వాళ్ళ కొంపగూడా మింగెయ్యాలని ఎత్తు వేస్తున్నాడు!'

గిరీంద్రుడు ఆశ్చర్య పోయాడు.

మనోరమ ఆ యింటి చరిత్రనంతా సాకల్యంగా, సంగ్రహంగా చెప్పింది. గత సంవత్సరం డబ్బులేక గురుచరణుని రెండవ కూతురి పెళ్ళి ఆగి పోవడమూ, అప్పుడు, వల్లమాలిన వడ్డీకి, తనే డబ్బిచ్చి, ఇల్లు తాకట్టు పెట్టుకోవడమూ, పైన పైనంగా తమ్ముడికి చెప్పి చివరికిలా అన్నది:

'గిరీన్! ఈ అప్పును గురుచరణుడు ఎలాగూ తీర్చలేడు; తీర్చలేడని తెలిసే, నవీనబాబు అప్పిచ్చాడు. ఓశుభ ముహూర్తాన ఆకొంపను కాస్తా పుచ్చేసుకొని, బద్దలు గొట్టించి, ఓబ్రహ్మాండమైన మేడ కట్టించేస్తాడు... ఊహాలకేం-దివ్యమైననే గిరీన్!'

ఈ సంగతులన్నీ విన్న గిరీంద్రుని మనస్సు క్షోభించింది.

'సరే! బాగానే ఉంది అక్కాయ్! గురుచరణునికి ఇంకా ఆడ పిల్లలున్నారు గదా, వారికెలా పెళ్ళిళ్ళవుతాయో!' అన్నాడు గిరీంద్రుడు వ్యధతో.

'ఆయన పిల్లలతో బాటు, లలితకూడా ఒకతే ఉన్నది గిరీన్! లలితకు అమ్మా నాన్నలు లేరు. ఆపిల్ల బరువు భారాలన్నీ ఈ పేద కుటుంబం మీద పడ్డాయి. ఎదిగిన పిల్ల. ఈసంవత్సరమయినా, దానికి పెళ్లి చెయ్యాలి. చెయ్యడానికి శక్తిలేదు. వాళ్ళ సమాజంలో, సహాయ సానుభూతులు చూపేవారు, లేరన్నమాటేగానీ, వెలివేసే వారు బోలెడు మంది! తీరాచూస్తే మనపనే హాయిగాఉంది గిరీన్! అవును గదూ?' అన్నది మనోరమ.

గిరీన్ ఏసమాధానమూ ఇవ్వ లేదు.

మనోరమ తిరిగి చెప్ప నారంభించింది.

'ఆరోజున ఎందుకో లలిత ప్రసక్తివచ్చి, వాళ్ళత్త నాముందు ఆవటిల్లి పోయింది తమ్ముడూ! పిల్లదానికి పెళ్లెలా చెయ్యాలో, ఈగండం గడవడ మెట్లాగో వారికి బోధపడడం లేదు. ఈదిగులుతో గురుచరణుడు, నిద్రాహారాలు కూడా మానేశాడు...మరిచి పోయాను. ముంగేరులో నీకు చాలా మంది తెలిసిన వారుండవచ్చు. కట్నం ప్రసక్తిలేకుండా, కేవలం పిల్లను, దాని గుణగణాలను చూసి, చేసుకొనే వారెవ్వరూ లేరా గిరీన్! ఇలాంటి పిల్ల దొరకాలంటే, చాలా కష్టం!'

గిరీంద్రుని పెదవుల మీద, ఓవిషాదపూరిత మందహాసం క్షణకాలం పారాడి మాసిపోయింది.

'అలాంటి స్నేహితు లెవ్వరూ లేరక్కాయ్! కావాలంటే, ధన సహాయం నేను చెయ్యగలను!'

గిరీంద్రుని తండ్రి డాక్టరు. ఆవృత్తిలో ఆయన ఎంతో ఆస్తిని గడించాడు. ఇప్పుడా సంపదకు గిరీంద్రుడే ఉత్తరాధికారి.

'అప్పుగా ఇస్తావా గిరీన్?' అన్నది మనోరమ.

'అప్పేమి టక్కయ్యా? శక్తి ఉండి తీరిస్తే మంచిదే! లేకపోతే నే నడగ దలుచుకోలేదు.

ఆశ్చర్య పోయింది మనోరమ.

'తమ్ముడూ! వారికి నువ్వెందుకు డబ్బిస్తా నంటున్నావో నాకు తెలియడం లేదు. మన సమాజీకులా కాదు. మన బంధువులా కాదు. ఇలా ఉట్టవుడియంగా, ఎవరైనా డబ్బును పారబోసుకొంటా రట్రా!'

గిరీన్ అక్కకేసి చూసి నవ్వాడు.

'మనకు బంధువులు కాకపోవచ్చు, మన సమాజంలోని వారూ కాక పోవచ్చు కానీ అక్కయ్యా! వారు మన దేశీయులు. ఈమాటను నువ్వు కాదన లేవు గదా! వాళ్ళు లేనివాళ్ళు, నేను కలవాణ్ని. అవసరానికి సరిపడేటంత గూడా లేకుండా వారు బాధ పడుతున్నారు. నాదగ్గర, ఉపయోగం లేకుండా చాలా డబ్బు మూలుగుతున్నది. వారికి నువ్వోసారి చెప్పిచూడక్కయ్యా! తీసుకోవడానికి వారికేమీ అభ్యంతరం లేకపోతే, ఇవ్వడానికి నేను సర్వదా సంసిద్ధుణ్ణి. లలిత వారికి బంధువు కాదు. నాకు అంతకన్నా కాదు. కానీ ఆమె మాతా పితృవిహీన. ఈఒక్క యోగ్యతే, నాకామె పట్ల కారుణ్యాన్ని కలిగిస్తున్నది. అవసరమయితే, ఆమె పెళ్ళి ఖర్చంతా నేనే భరిస్తాను. నువ్వోసారి వెళ్ళి అడిగిరా అక్కయ్యా!' అన్నాడు గిరీంద్రుడు వ్యాకుల పాటుతో.

ఇంతసేపూ గిరీంద్రుడు చెప్పిన ఈ కారణాలలో ఏ ఒక్కటీ మనోరమ మనస్సును సంతృప్తి పరచ లేదు. గిరీంద్రుడు తన డబ్బు నేమి చేసుకొన్నా ఆమెకు బాధలేదు. ఆమె విచారించవలసిన అవసరం అంతకన్నా లేదు. కానీ మనోరమ ఓసాధారణమైన స్త్రీ. నిర్వ్యాజంగా, మరొకరికి ధనరూపంతో సాయపడటాన్ని చాలా మంది స్త్రీలు సహానంతో చూడలేనట్లే, మనోరమగూడా చూడ లేక పోతోంది.

ఇంతవరకూ, శ్రద్ధతో వింటూ కూచున్న చారుబాల, ఉత్సాహంతో, ఎగిరిపడ్డది. 'మామయ్యా! అలాగే ఇవ్వు, నేనీ విషయం వాళ్ళత్తకు చెప్పి వస్తాను!'

'చారూ! చిన్నగుంటవు, నీకెందుకే ఈ పెద్దవారి పనులన్నీ? అవసరమయితే నేనే వెళ్ళి చెబుతానుగానీ, నువ్విక్కడే తగులడూ!' అన్నది మనోరమ కూతురు కేసి గుడ్లురిమి చూస్తూ.

'అలాగే! నువ్వే చెప్పు అక్కయ్యా! మొన్న గురుచరణుగారు రోడ్డు మీద తటస్థ పడ్డాడు. ఆయనతో కాస్సేపు మాట్లాడాను గూడాను. చాలా మంచి వాడులా ఉన్నాడు. అవునా అక్కయ్యా?'

'నేనే గాదు గిరీన్ బాబూ! అతన్ని గురించి ప్రతివాళ్ళూ అలాగే అంటారు. ఆ భార్యా భర్తలు చాలా అమాయకులు. ఈ కాలపు బొంద పోకిళ్ళు వారికి తెలియవు. అందుకే ఎక్కడెక్కడి కష్టాలూ వారి నాశ్రయిస్తుంటాయి. ఇలాంటి అమాయకులు-చివరికి నిలవనీడ లేకుండా పోగొట్టుకొనే స్థితిలో కొస్తున్నారు. దానికి వేరే నిదర్శనం కావాలా తమ్ముడూ నీకు? శేఖర్ బాబు పిలుస్తున్నాడని అన్నా కాళీవచ్చి అన్నదో. లేదో, గడగడలాడుతూ పిల్లిలా ముణుముకు పోయింది లలిత. ఒక్క లలితే గాదు: ఆయింట్లో వారందరూ, వీరి కివిశ్వంగానే హడిలి పోతుంటారు. వీరెంతగానో వారిని సంతోష పరచాలని చూస్తారుగాని, అది లాభం లేదు తమ్ముడూ! నవీనరాయ్ గారి ఉచ్చులో ఓసారిపడటం జరిగిందంటే, దాని నుండి విముక్తి లభించటం—ఇక అసంభవ మనుకో!'

'అలాగా అక్కాయ్! అయితే ఈసంగతి వారితో తప్పకుండా చెబుతావు గదూ?'

'తప్పకుండా చెబుతాను.' అన్నది మనోరమ మందహాసం చేసి. 'ఇంతదయ నీలో కలగడానికి హేతువేమిటి తమ్ముడూ?'

'హేతువా?' అన్నాడు గిరీంద్రుడు. 'కష్టనష్టాలలో, ఒకరికొకరు సాయపడటం మానవుని కనీస ధర్మం.' అంటూ వాకిలి దాకా వెళ్ళి తిరిగి వచ్చాడు.

'మళ్ళీ వచ్చావేం తమ్ముడూ?' అన్నది మనోరమ.

'అక్కయ్యా!' అన్నాడు గిరీంద్రుడు నవ్వుతూ. 'ఇప్పుడు నువ్వు చెప్పిన ఈ వేదనామయ గాథ పూర్తిగా నిజం గాదనుకొంటాను.

'ఎందుకనిరా తమ్ముడూ?' అన్నది మనోరమ కొయ్యబారి.

'ఎందుకనంటే-' అన్నాడు గిరీంద్రుడు. 'లలిత డబ్బు ఖర్చుపెట్టే పద్ధతి చూస్తే, వాళ్ళు దరిద్రులనుకోనే అవకాశం ఎక్కడా లభించదు. ఆరోజు మేము నాటకం చూడటానికెళ్ళాం! లలిత రాలేదు. అయినా పది రూపాయల నోటిచ్చి పంపింది. ఇంకా చిల్లరమల్లర ఖర్చులెన్ని చేస్తుందో, మన చారు బాల నడిగిచూడు. నా ఉద్దేశ ప్రకారం, నెలకు ఇరవైరూపాయలన్నా లేనిదే, ఆపిల్లకు జరగదు.'

గిరీంద్రుని మాటలను మనోరమ నమ్మలేక పోయింది.

'అమ్మో! అదంతా నిజమే నే! లలిత అలానే ఖర్చు చేస్తుంది. ఆ డబ్బంతా శేఖర్ దాది. ఇప్పుడే గాదు: చిన్నతనంనుండి కూడా లలిత, శేఖర్ బాబు బీరువా తెరిచి, డబ్బు తెచ్చుకొంటూ ఉంటుంది. ఆమెను ఎవ్వరూ ఏమీ అనరు.' అన్నది చారుబాల.

'అలా డబ్బు తీసుకొంటుందని అతనికి తెలుసటే చారూ?' అన్నది మనోరమ కూతురు కేసి సందేహాస్పదంగా చూస్తూ.

'ఆఁ' అన్నది చారు బాల తలపంకించి. 'ఆయనక్కడుండగానే, బీరువాతీసి డబ్బు తెచ్చుకొంటుంది. పోయిన అన్నాకాళీ బొమ్మల పెళ్ళికి అయిన డబ్బంతా, లలితే ఇచ్చింది!'

మనోరమ కాస్సేపు ఆలోచించి, చివరికిలా అన్నది: 'ఏమో? ఈ సంగతులన్నీ ఎవరికి కొట్టాయిగనక ఆరాలు తీస్తుంటారూ? కానీ తమ్ముడూ! ఒక్కటి మాత్రం నిజం! శేఖర్ బాబు, తండ్రిలాంటి బిజిని బాబుగాదు. కాస్త దయా ధర్మాలు, న్యాయాన్యాయాలు ఆలోచించే ఘటం! అదిగాక, లలిత చాలామంచి పిల్ల. చిన్నతనం నుండీ, వారింట్లోనే తిరుగుతున్నది. శేఖర్ ని 'అన్నా' అని పిలిచేది. ఆపిల్లంటే, ఆయింటి వారందరూ, ఎంతో అపేక్షగా చూస్తారు ..సరేగానీ, చారూ! నువ్వు తరచుగా వారింటికి వెడుతుంటావు గదా: మాఘమాసంలో శేఖర్ పెళ్ళని విన్నాను. నిజమే నా? ఆముసిలాడు కట్నం క్రింద చాలా డబ్బు గుంజుతాడని అంతా అనుకొన్నారు కూడానూ—!'

'అవునమ్మా! మాఘ మాసంలోనే పెళ్ళి-అన్నీ నిశ్చయమై పోయాయి!' అన్నది చారు బాల.

అటు చిన్నవారిలోను, ఇటు పెద్దవారిలోను మెలగ గలిగినవాడు గురుచరణుడు. నాలుగయిదు రోజుల పరిచయానికే, అతనికీ, గిరీంద్రునికీ మంచి స్నేహ మేర్పడింది. గురుచరణుడు అదోలాంటి మనిషి. అతని మనస్సు దృఢమైనది కాదు. వాదించడమంటే అతనికెంతో ఇష్టం! ఆ వాదనలోని జయాపజయాల నాతడు లక్ష్యపెట్టేవాడు కాదు.

ప్రతిరోజూ సాయంత్రపుటీని తన ఇంటివద్ద పుచ్చుకోమని, గిరీంద్రునికి ఒకటే ఫర్మానా జారీచేశాడు గురుచరణుడు. కానీ అతను ఆఫీసునుండి ఇంటి కొచ్చేసరికే ప్రొద్దుకూకుతూ ఉండేది. ఆయన ఆదరాబాదరా, కాళ్లుచేతులు శుభ్రంచేసుకొని, 'లలితా! టీ తీసుకురా తల్లీ!! అన్నాకాళీ, నువ్వెళ్లి, మీగిరీన్ మామను పిలుచుకురా పో' అని తొందర పెడుతుండే వాడు. గిరీన్ వచ్చేవాడు. టీ త్రాగిన తరువాత, ఇద్దరూ తర్క వితర్కాలలో నిమగ్నులయ్యే వారు.

ఒక్కోసారి లలిత, మామగారి చాటున నిలబడి, ఈ వాదోపవాదాలను ఆసక్తిగా వింటుండేది. అలా లలిత నిలబడిన రోజున, గిరీంద్రుడు ఉత్సాహ ప్రపూర్ణుడై, సమధిక శక్తితో తర్కిస్తుండే వాడు. సాధారణంగా తర్కనీయాంశం, ఆధునిక సమాజానికి సంబంధించినదై ఉండేది. సమాజ హృదయ హీనత, క్రూరమైన అత్యాచారాలు, అన్యాయాలు, అసంగతమైన ఉపద్రవాలు మొదలైన యథార్థ విషయాల మీదనే చర్చ జరుగుతుండేది.

ఈ అన్యాయ కార్యాలను సమర్థించే, యథార్థ ప్రమాణాలంటూ ఏమీ లేవు. లేవు గనక నే, పీడిత హృదయుడైన గురుచరణుడు, గిరీంద్రుని భావాలతో తరచు ఏకీభవిస్తుండే వాడు.

'గిరీన్ బాబూ! మీరంటున్నది నిజమే! ఒకరు అన్నారని కాదు గానీ, యుక్తవయస్సు రాగానే, ఎవరి పిల్లలను వారు విధిగా పెళ్లిచేయవలసిం! ఈ సూత్రాన్ని నేనూ ఒప్పుకొంటాను. కానీ నేననేదేమిటంటే: ఆ పెళ్లి చేయడ మనేది ఎలా సంభవమా అని? ఎదిగిన పిల్లగనుక వెంటనే పెళ్ళి చెయ్యమంటుంది సమాజం! మంచిదే! అలా వివాహం చేయడానికి అదిచ్చే సహాయ మేమిటి? చేసే దోహదక్రియ లేమిటి? ఏమీ లేదు. కానీ

ఆజ్ఞలు మాత్రంజారీచేస్తుంటుంది. ఎక్కడి దాకానో ఎందుకు గిరీన్ బాబూ! నా సంగతిచూడు. ఉన్నకొంప తాకట్టుపెట్టాను. దానిని నేను విడిపించు కొనే ప్రశ్నేలేదు. ఇంకోపదిరోజులుపోయాక, పిల్లలతో సహా నడి వీధిలో నిలబడడం మినహా, మరో గత్యంతరం లేదు. ఆనాడు సమాజం నన్నాద రిస్తుందా? నాకింత నిలువనీడ కల్పిస్తుందా? ఇవేమీ చేయదని నాకు తెలుసు. నీకూ తెలుసు. అవునా గిరీన్ బాబూ!'

గిరీంద్రుడు మౌనంగా ఉండిపోవడంతో గురుచరణుడే మళ్లీ ప్రారంభించేవాడు.

'నేను చెప్పింది అక్షరాలా యథార్థం బాబూ! ఇలాంటి దిక్కు మాలిన సమాజంలో ఉండటంకన్న, దీనినుండి వెలికి రావడం మంచిది. దానివల్ల, తిన్నాతినకపోయినా, మనస్సన్నా చీకూచింతా లేకుండా ఉం టుంది. బాధితుల బాధలను, దుఃఖితుల దుఃఖాలను, అర్థంచేసుకోలేని ఈ సమాజం: చేసే సాయం లేకపోగా, కనులెర్రజేసి, మీదికురికే ఈసమాజం; నాలాంటి బీదవారుండేది కాదు; మీవంటివారిదీ కాదు. ఈ సమాజం భాగ్య వంతులకోసం ఏర్పడింది. వారినే అందులో సుఖంగా ఉండనివ్వు. మాకిది అవసరంలేదు.' అని చప్పున మౌనం వహించేవాడు గురుచరణుడు.

ఈ తర్క వితర్కాలను లలిత శ్రద్ధగా వినడమేగాదు; రాత్రి పూట నిద్రపట్టేవరకూ వాటిని గురించే తీవ్రంగా ఆలోచిస్తుండేది. అఖండన మండనాలలోని ప్రతిమాట, యుక్తి ప్రయుక్తులలోని ప్రతి పదమూ, ఆమె మనస్సుపై చెరిగిపోని ముద్రను ముద్రించాయి. గిరీంద్రుడు ఉచ్చరించే ప్రతివాక్యమూ ఆమె కెంతగానో నచ్చేది. అతనన్నవన్నీ ధర్మ సమ్మతాలేనని లలిత పూర్తిగా విశ్వసించింది.

గురుచరణుడంటే లలితకు చాలా ప్రేమ. అలాంటి గురుచరణుని తన వేపుకు ఆకర్షించుకొన్నాడు గిరీంద్రుడు. తన మామతో బాటే తను కూడా అతని వేపు ఆకర్షితురాలయింది. మామయ్య తన కోసం నానా బాధలూ పడుతున్నాడు. ఈ గొడవలతో ఆయన నిద్రాహారాలు కూడా విసర్జించాడు. ఇవన్నీ తనకు ఆశ్రయమివ్వడం వల్లనే మామ అనుభవించ వలసి వస్తున్నది. ఈనాడు మామకు 'జాతి' పోతుందట. ఎందుకని పోవాలి? మామగారు చేసిన అపరాధ మేమిటి? తనకు ఆశ్రయమివ్వడమా? తన కింత వరకూ పెళ్ళి చెయ్యక పోవడమా? వివాహంచేసి, తను విధవరికొన్ని

పోంది, ఈ మామగారింటనే ఉంటే—జాతి పోగు మళ్ళీ. ఈ వ్యత్యాస మెందుకు కేప్పడాలి?' తన హృదయంలో గాఢంగా హత్తుకు పోయిన గిరీంద్రుని వాదనా సారాంశాన్ని, మరో సారి వెలికిలాగి, దానిని గురించే మననం చేస్తుండేది లలిత. తన మామగారి దుఃఖ గాథను విని, ఆరాటపడి, ఆర్ద్ర హృదయంతో సానుభూతి చూపుతున్న వారి పట్ల, ఆదరము చూపకుండా ఉండ లేక పోయింది. గిరీంద్రుని—మనస్సులోనైనా భక్తితో ఆరాధించకుండా ఉండడం ఆమె వల్ల కాలేదు. రోజులు గడుస్తున్న కొద్దీ గురు చరణుని లాగానే లలిత కూడా, 'టీ' వేళ ఎప్పుడవుతుందా అని ఎదురు చూడ సాగింది.

పరిచయమైన ప్రారంభ దినాలలో లలితను 'మీరు' అని సంబోధిస్తుండే వాడు గిరీంద్రుడు. అలా పిలవ వద్దనీ, లలితను 'నీవు' అంటే చాలుననీ గురుచరణుడు గిరీన్ బాబుతో అన్నాడు. అప్పటి నుండీ అతను 'నువ్వు' అనే లలితను సంబోధిస్తుండే వాడు. ఒక రోజున గిరీంద్రుడు 'లలితా! నువ్వు టీ త్రాగావా?' అన్నాడు.

లలిత 'నేను త్రాగను' అన్నట్టు తల అడ్డంగా ఆడించింది.

'ఎందు కని?'

'వాళ్ల శేఖర్ దా త్రాగ వద్దన్నాడు. ఆడవాళ్లు టీ త్రాగడ మంటే అతని కిష్టం లేదు' అన్నాడు గురుచరణుడు.

ఈ కారణం గిరీన్ బాబును సంతోష పరచలేదని లలిత గమనించింది. ఈనాడు శని వారము. మామూలు రోజుల కంటే, ఈనాడెక్కువ సేపు సాగుతుందీ సభ.

అందరూ టీ త్రాగడం పూర్తి చేశారు. ఈనాటి సంభాషణలలో గురుచరణుడంత ఉత్సాహంగా పాల్గొన లేదు. పరాధీన చిత్తునిలా, ఏమిటోగా మసలాడు. గిరీంద్రుడా అస్వస్థతను గ్రహించి 'ఇవాళ మీ వంట్లో కులాసాగా లేదను కొంటాను!' అన్నాడు.

గురుచరణుడు హుక్కా గొట్టం నోటి నుండి తీస్తూ, 'ఏం? ఎందుకు లేదు? నా వంట్లో బాగానే ఉన్నదే!' అన్నాడు.

'అలాగా—అయితే ఆఫీసులో ఏమన్నా...' అని వాక్యం మధ్యలోనే ఆపేశాడు గిరీన్ బాబు.

'ఎబ్బే! అలాంటి గొడవలేమీ లేనిదే—' అన్నాడు గురుచరణుడు విస్తుపోయి గిరీన్ బాబు వంక చూస్తూ. ఆయన హృదయస్థమైన ఉద్వేగోద్రేకాలు, ఎంత అమాయకులైనా, ఇట్టే గ్రహించవచ్చును.

ఇది వరకు వీరి సంభాషణలలో లలిత పాల్గొనేది కాదు. కానీ ఇటీవల కొంత కాలం నుండీ ఆమె కూడా జోక్యం కలుగజేసుకొని, ఒకటి రెండు మాటలన నారంభించింది. గిరీన్ బాబుకు వచ్చిన సందేహాలు ఆమెకూ వచ్చాయి. 'నిజమే మామయ్యా! ఇవ్వాళ నీ మనస్సు బాగా లేదనుకొంటాను. మనిషివి అదోలా ఉన్నావు.' అన్నది లలిత.

గురుచరణుడు ఫకాలుమని నవ్వాడు.

'అదా సంగతి లలితా? నువ్వన్నది నిజమే తల్లీ! ఈనాడు నా మనస్సు నిజంగానే బాగో లేదు.' అన్నాడు గురుచరణుడు.

లలితా గిరీను లాయన ముఖం కేసి చూశారు.

'నా స్థితి గతు లేమిటో నవీన బాబుకు తెలుసు. తెలిసికూడా నన్ను నడివీధిలో నిలవేసి, బాకీని గురించి కటువుగా అడిగాడు. ఒక రకంగా చూస్తే, ఇది ఆయనగారి తప్పు కాదేమో ననుకొంటాను. ఇప్పటికి ఆరు మాసాలయింది; ఇంత వరకూ—'అసలు' సంగతి దేవుడికి తెలుసు; వడ్డీ అన్నా చెల్లు కట్టలేక పోయాను. మరి అడిగాడంటే అడగడా?' అన్నాడు గురుచరణుడు కాతర స్వరంతో.

లలిత ఈ రకమైన ప్రసంగాన్ని అణచి వేయాలని చాలా ప్రయత్నించింది. ప్రపంచ జ్ఞానం లేని మామగారు; లజ్జాకరమైన ఇంటి విషయాలు, ఇలా పరాయి మనుషుల ముందు బైటపెట్టడాన్ని ఆమె ఆమోదించలేక పోయింది. పొరబాటున అలా బైటపెట్టగలడేమోనన్న ఆదుర్దాతో 'మామయ్యా! నువ్వు దాన్ని గురించి, ఆట్టే ఆలోచించకు. ఈ గొడవలన్నీ తరువాత చూసుకో వచ్చు' అన్నది లలిత.

'ఆ తరువాత చూసుకోవడానికేముంటుందమ్మా?' అన్నాడు గురుచరణుడు, లలిత మాటను గ్రహించకుండా. 'గిరీన్ బాబూ! దిగులు పడకుండా నేను ఉండాలని మా లలిత అనునిత్యం చూస్తూ ఉంటుంది.' అని లలిత వేపు తిరిగి ఇలా అన్నాడు- 'కానీ నువ్వు తప్ప మరెవ్వరూ ఈ నీ దుఃఖితుడైన మామ ముఖాన్ని చూడదనన్నా చూడరమ్మా లలితా?'

'నవీన బాబు ఏమన్నా డేమిటి?' అన్నాడు గిరీంద్రుడు.

అతనికీ సంగతులన్నీ తెలుసు నన్న సంగతి లలితకు తెలియదు. అందుకే,ఎంతో కుతూహలంతో అడిగిన గిరీంద్రుని ఈ అసంగతమైన ప్రశ్నకు లలిత లోలోన కోపగించు కొన్నది.

గురుచరణు డిలా అన్నాడు:

'నవీన బాబు భార్య చాలా రోజుల నుండీ అజీర్ణ వ్యాధితో తీసు కొంటున్నది. ఇప్పుడది మరింత తీవ్ర దశ కొచ్చింది. వైద్యులు పరీక్షించి గాలి మార్పు చాలా అవసర మన్నారుట.అందుకే ఇప్పుడు డబ్బు అవసరం మొచ్చిందట. అసలు ఫాయిదాలతో మొత్తం కక్కమంటున్నాడు నవీన బాబు!'

గిరీంద్రుడు ఒక్క క్షణం మౌనంగా ఉండి అన్నాడు:

'చాలా కాలంనుండి మీతో ఓ సంగతి చెబుదామని అనుకొంటూనే చెప్పలేక పోయాను. మీరు మరోలా భావించనని మాటిస్తే ఇప్పుడు చెబుతానా సంగతి!'

'గిరీన్ బాబూ!' అన్నాడు గురుచరణుడు నవ్వుతూ. 'నాతో ఏ విషయం చెప్పాలన్నా, ఎవ్వరూ సంకోచించ నవసరం లేదు. అలా సంకోచించరు కూడాను...సరే! ఏమిటా విషయం?'

'నవీన బాబు వడ్డీలు అధికంగా పుచ్చుకొంటాడని మా అక్కగారి నోటంట విన్నాను...గురుచరణ్ బాబూ! నేను బాగా ఉన్నవాణ్ని. చాలా డబ్బు నా దగ్గర నిరుపయోగంగా పడి ఉన్నది. వారా, డబ్బు కోసం ఇబ్బంది పడుతున్నారాయె! ముందా బాకీ తీరిస్తే బావుంటుందను కొంటున్నాను!'

ఆ మామా కోడళ్ళు ఆశ్చర్యపోయి, రెప్ప వేయకుండా గిరీన్ కేసి చూస్తున్నారు. గిరీంద్రుడు తిరిగి, సంకోచంతో ఇలా చెప్ప నారంభించాడు.

'ప్రస్తుతం నా దగ్గరున్న డబ్బుతో నాకే అవసరమూ లేదని మీకు మనవి చేస్తున్నాను. మీకు చే మెల్లాగా ఉన్నప్పుడే, నాకివ్వవలసింది ఇవ్వ వచ్చు. తొందర లేదు. నవీన రాయ్ గారు ఇప్పుడు డబ్బు కోసం, మహా ఇబ్బంది పడిపోతున్నారు గనక, వారికి సర్దితే బావుంటుంది!'

'ఆ పైక మంతా నువ్వు ఇవ్వగలవా గిరీన్?'

'ఆహా!' అన్నాడు గిరీంద్రుడు. 'మొత్తం పైకమూ వారికి కావలసి ఉంటే, అలాగే మొత్తమూ ఇస్తాను.'

గురుచరణు ఏదో చెప్ప బోయేంతలో, అన్నాకాళీ పరుగెత్తుకొంటూ వచ్చి ఇలా అన్నది:

'వదినా! శేఖర్ బాబు, నిన్ను గుడ్డలేసుకు రమ్మంటున్నాడు; నాటకం చూడడాని కెళ్ళాలట'

ఈ మాటలని సుడిగాలిలా రివ్వున దూసుకెళ్ళింది కాళీ. ఆ పిల్ల హడావుడి చూసి తనలోతాను నవ్వు కొన్నాడు తండ్రి. లలిత కదల లేదు. మెదల లేదు. అలాగే కూర్చుండి పోయింది.

ఇంతలోకే అన్నాకాళీ మళ్ళీ సుడిగాలిలా గదిలోకి వచ్చి 'అయ్యో! ఇదేమిటి వదినా? నువ్వింకా లేవన్నా లేవ లేదేం? మేమంతా నీ కోసం కనిపెట్టుకొని ఉన్నాం!' అన్నది.

...ఈ మాటలు విన్న తరువాత గూడా లలిత వెళ్ళే ప్రయత్నాలలో లేక పోవడం గురుచరణుడు గమనించి, అన్నాకాళీ కేసి నవ్వుతూ చూసి, లలిత తల నిమురుతూ, అన్నాడు; 'సరే! నీ కోసం వారందరూ కనిపెట్టుకొని ఉన్నారట వెళ్ళిరా తల్లీ!'

లలిత లేవక తప్పిందిగాదు. పోతూ పోతూ, గిరీంద్రుని వైపు కృతజ్ఞతా పూర్వకంగా చూసింది. గిరీన్ బాబు అది గమనించాడు.

పది నిమిషాలు గడిచాయి. లలిత మంచి దుస్తులు వేసుకొని, తాంబూల మిచ్చే మిషతో, బైట గదిలో కొచ్చింది. గిరీన్ బాబు అప్పటికే వెళ్ళి పోయాడు. మామగారు, బాలీసుకు చేరగిలబడి, కళ్లు మూసుకొని ఉన్నాడు. మూతలు పడిన కన్నుల నుండి బాష్ప బిందువులు ఉరల సాగాయి. అవి ఆనంద బాష్పాలని లలితకు తెలుసు. మామగారి మధుర భావనా ముద్రను భంగ పరచడం ఆమె కిష్టం లేక పోయింది. ఎంత నిశ్శబ్దంగా వచ్చిందో, అంత నిశ్శబ్దంగానూ వెళ్ళి పోయింది.

కళ్ళనిండా నిండిన నీటితో శేఖరుని గది ప్రవేశించింది. అక్కడ అన్నాకాళీ లేదు. అందరికన్నా ముందు వెళ్ళి బండిలో కూర్చున్నది. శేఖరుడు మాత్రం—ఆమె కోసమే నేమో-అక్కడ పారాడు తున్నాడు,

ఆమె పాదాల ధ్వని విని, తల పైకెత్తి లలిత ముఖంలోకి చూశాడు శేఖరుడు.

గత పది రోజుల నుండీ లలిత నతడు చూడలేదు. ఆమె తనకు కని పించ నందుకు, శేఖరుడు చాలా కోపంగా ఉన్నాడు. కానీ దుఃఖిస్తున్న లలిత అతని కంట పడగానే, పూర్వపు సంగతులన్నీ ఒక్క క్షణంలో ప్రక్కకు నెట్టి, 'అసేమిటి లలితా? ఏడుస్తున్నా వెందుకు?' అన్నాడు ఆదరంగా.

లలిత తల వంచుకొన్నది. విచారించవద్దని చెప్పినట్లు తల అడ్డంగా తిప్పింది.

ఇటీవల లలిత కనిపించక పోవడంతో, శేఖరుని మానసత్వంలో పరి వర్తనేదో కలిగింది. అతడు లలితను సమీపించాడు. రెండు చేతులతోనూ, లలిత ముఖాన్ని పైకెత్తి పట్టుకొని, కళ్ళల్లోకి సూటిగా చూస్తూ 'కాదనకు లలితా! నువ్వుబడమాడు తున్నట్లు నాకు తెలుసు. ఎందు కేడుస్తున్నావు? ఏమి జరిగింది?' అన్నాడు.

లలిత తనను తాను నిగ్రహించుకొనలేక పోయింది. అక్కడే కుప్ప కూలి పోయింది. ముఖాన్ని రెండు చేతులతోనూ కప్పుకొని బావురు మని ఏడ్చింది.

## 6

నవీన రాయ్ గారు అసలు ఫాయిదాలు లెక్క కట్టి తీసుకొని, దస్తా వేజు గురుచరణుని కిస్తూ, 'అది సరేగానీ గురుచరణ్! ఈ డబ్బు నీకెవ రిచ్చారోయ్?' అన్నాడు.

'ఈ మాట మాత్రం నన్నడగ బోకన్నయ్యా! తన పేరు బైట పెట్టని షరతు మీద, ఆయనవద్ద డబ్బు పట్టు కొచ్చాను!'

తన డబ్బు వడ్డీతో సహా తన చేతి కొచ్చినందుకు నవీన బాబు సం తోషించ డానికి మారు విచారించాడు. తన ప్రణాళిక ఇలా భగ్నమవు తుందని అతను ఏనాడూ ఊహించ లేదు. తనేమో, గురుచరణుని ఇల్లు బాకీ క్రింద పుచ్చుకొని, ఎలాటి మేడ కట్టించాలా-అని ఆలోచిస్తున్నాడు. అతనేమో చప్పాగా డబ్బు చెల్లగట్టి, తాకట్టు దస్తా వేజు పుచ్చుకెడు

తున్నాడు. ఈ ఉద్రేకాన్ని నవీన బాబు భరించ లేక పైకి వెళ్ళ గొట్టాడు.

'ఇప్పుడిలాంటి షరతు లెన్నయినా పెడతావు గురుచరణ్! ఇన్నిటికీ నిన్ననవలసిన పని లేదు. తప్పంతా నాది. డబ్బడగడమే, మహాపరాధమయి పోతున్నది. అందుకే దీన్ని కలికాల మంటున్నారు!'

గురుచరణు డా మాట విని బాధ పడ్డాడు. 'అన్నయ్యా! అలా అనకు. మీ ధన ఋణం తీర్చాను గానీ, మీ దయా ఋణాన్ని తీర్చ లేద న్నాయ్!' అన్నాడు.

నవీనుడు నవ్వాడు. అతను బోలెడంత ప్రపంచాన్ని చూశాడు. ఎంతో అనుభవం గడించాడు. ఇలాంటి 'మర మెచ్చు' లకు మురిసి పోయే ఘటం కాదు. అయినట్లయితే, అతను వ్యాపారం చెయ్యనూ చెయ్యడు. చేసినా అందులో లక్షలాది ఆర్జించనూ ఆర్జించడు.

'తమ్ముడూ! ఏదో అనాలని, అలా అంటున్నావు గానీ, నిజంగా నువ్వీ మాట మనస్ఫూర్తిగా అనడం లేదు. నిజంగా నువ్వంటున్నదే నిజ మైతే, అణా పైసలతో ఇలా నా డబ్బు ముఖాన గిరవాటు కొడతావా? ఒక్క సారంటే, ఒక్కసారి గావును అడిగాను. అదీ నా కోసం కాదు; మీ వదిన గారి కోసం...సరే జరిగిందేదో జరిగి పోయింది గానీ, ఎంత వడ్డీ మీద ఇల్లు తాకట్టు పెట్టావేమిటి?'

'తాకట్టు పెట్టలేదన్నయ్యా!' అన్నాడు గురు చరణుడు నవీన బాబు ప్రశ్నకు తల అడ్డంగా తిప్పుతూ. 'వడ్డీగూడా 'ఇంత' అని తేల్చుకో లేదు.'

ఈ మాటలు నవీనుడు నమ్మలేక పోయాడు. 'ఏమిటోయ్ తమ్ముడూ! తాకట్టు లేకుండా, వడ్డీగూడా లేకుండా, డబ్బు తెచ్చుకొన్నావా?'

'నిజమన్నయ్యా! ఒక రకంగా, నువ్వన్నదే యదార్థం. ఆ కుర్రవాడు చాలా ఉత్తముడు.'

'కుర్రవాడా?' అని ఆశ్చర్య పోయాడు నవీన రాయ్. 'కుర్ర వాడంటే—ఏ కుర్రవాడు తమ్ముడూ?'

గురు చరణుడు తన తప్పిదాన్నిప్పుడు గ్రహించాడు. అసలీ మాట యినా, జారడం పొరబాటని గమనించాడు.

నవీన బాబు, గురుచరణుని మనోభావం గుర్తించి, మెల్లగా నవ్వుతూ 'పేరు చెప్పడం గురించి నిషేధ మున్నప్పుడు చెప్పకు. చెప్పమని, నిన్ను బలవంత పెట్టను. కానీ కాస్తంత కనుగలిగి ప్రవర్తిస్తుండాలి గురుచరణ్! నీ సంగతి నాకు తెలుసు గనక ఇంతగా చెబుతున్నాను. మంచికి పోయి, మెడకు తెచ్చుకొనే మనిషివి నువ్వు. జాగ్రత్త!'

మరో వ్యాఖ్యాన మేమీ చేయకుండా, అవసరమైన కాగితాలు పుచ్చుకొని, నవీన బాబుకు నమస్కరించి, గురుచరణుడు వెళ్ళి పొయ్యాడు.

భువనేశ్వరి అజీర్ణవ్యాధి పీడిత. ప్రతి సంవత్సరమూ, ఈ రోజులలో ఆమె 'పరదేశం' వెళ్ళి వస్తూ ఉంటుంది. ఈ దేశ యాత్ర, ఆమె వ్యాధిని-తాత్కాలికంగానే అవుగాక—సమయింప జేస్తుంటుంది. తన కార్యం నిర్విఘ్నంగా నెరవేరేందుకు, నవీన రాయ్ గారు, ఈ యాత్రను ఆధారం చేసుకొన్నాడు. వ్యాధిని పెంచి, పెద్దది చేసి, గురుచరణుని డబ్బు కోసం వత్తిడి చేశాడు. సరే—జరగవలసిం దేదో అలా జరిగింది.అయినా ప్రయాణ సన్నాహాలు మాత్రం సాగుతూనే ఉన్నాయి.

ఆనాటి ఉదయం శేఖరబాబు, ముఖ్యమైన వస్తువులను సూటు కేసు లోకి సర్దుతున్నాడు. అన్నాకాళీ వచ్చి, 'శేఖర్ దా! మీరు రేపే గదూ వెళ్ళడం?' అన్నది.

'అవును.' అన్నాడు శేఖరుడు సూటుకేసు నుండి దృష్టి మరల్చి.' 'కాళీ! మీ వదినె నొకసారి, నేను పిలుస్తున్నానని చెప్పు. ఏమేమి కావాలో నాకు తెలియడం లేదు. ఆమె వచ్చి పెట్టె సర్దుకొంటుంది...'

అన్నాకాళి తల అడ్డంగా తిప్పి, 'ఈసారి వదిన రాదు శేఖర్ దా!' అన్నది.

'ఎందుకని?'

'ఎలా వస్తుంది శేఖర్ దా?' అన్నది అన్నాకాళి నవ్వుతూ. 'వచ్చే మాఘ మాసంలో వదినెకు పెళ్లి చెయ్యాలయ్యె. నాన్నగారేమో సంబంధాల కోసం తిరుగుతున్నా రయ్యె—'

శేఖర్ స్తబ్ధుడయినాడు.

ఇంట్లో పెద్ద వారను కొంటుండగా విన్న సంగతులన్నీ అన్నాకాళీ చెప్ప నారంభించింది.

'ఎంత డబ్బయినా సరే, మంచి సంబంధం వెదకమని గిరీన్ బాబు అన్నాడు. మా నాన్న ఇవ్వాళ కూడా ఆఫీసు కెళ్ళలేదు శేఖర్ దా! ఫోం చేశాం, వరుణ్ని చూడడానికి వెళ్లాలను కొంటున్నాడు. గిరీన్ బాబుగూడా మా నాన్నతో బాటు పోతున్నాడుగా!' అన్నది అన్నాకాళీ.

శేఖరుడు స్తిమితంగా కూచున్నాడు. అన్నాకాళీ చెబుతున్న విషయాలు సావధానంగా విన్నాడు. లలిత ఇటీవల తనకు కనిపించక పోవడానికిగల కారణాలు చూఛాయగా తెలిశాయి. అన్నాకాళీ ఉత్సాహంతో ఇంకా చెప్పుతు పోతున్నది.

'గిరీన్ బాబు చాలా మంచి వాడు శేఖర్ దా! అక్క పెళ్ళికిగాను ఇంటిని పెదనాన్న గారికి తాకట్టు పెట్టాంగా. మరో రెణ్ణెల్లు పోతే, మేము వీధిలో నిలబడ వలసి వచ్చేదట. అందుకనే, నాన్న గిరీన్ బాబు దగ్గర డబ్బు తీసుకొని, పెదనాన్న కిచ్చి, బాకీని రద్దు చేశాడు. ఇక మాకేమీ భయంలేదని, చెప్పింది వదిన. నిజమేనా శేఖర్ దా?'

జవాబేమీ ఇవ్వకుండా అలానే చూస్తూ ఉండి పోయాడు, శేఖర్ బాబు.

'శేఖర్ దా! ఏమీ టాలోచిస్తున్నావ్?' అన్నది అన్నాకాళీ.

శేఖర్ స్పృహ వచ్చినట్టు ఉలిక్కి పడ్డాడు. 'ఏమీ లేదు గానీ, నువ్వు పరుగెత్తు కొంటూ వెళ్లి, లలితను ఒకసారి పిలుచుకు రా. నేను రమ్మంటున్నాని చెప్పు కాళీ!'

అన్నాకాళీ పరుగెట్టికెళ్లింది.

లలిత వచ్చి, సరాసరి గదిలో కెళ్ళకుండా, ముందు కిటికీలో నించి చూసింది. శేఖర్ బాబు వైవర్ణ్య వదనంతో క్రింద కూచుని ఉన్నాడు. ఇంత విచార వదనంతో శేఖరు డుండటాన్ని ఆమె ఇది వరకు ఎరుగదు. ఆమెకు ఆశ్చర్య మేసింది. భయం కూడా కలిగింది. అలాగే తడబడుతూ గదిలో కొచ్చింది లలిత.

'ఇలారా!' అని పిలిచాడు శేఖర్ తొట్రుపడుతూ.

'నన్ను—పిలిచారా శేఖర్ దా?' అన్నది లలిత మెల్లిగా.

'ఆఁ' అన్నాడు శేఖరుడు.

ఒకటి రెండు క్షణాలు గడిచాయి.

'రేపు ఉదయం బండికి, అమ్మతో సహా పశ్చిమదేశం వెడుతు న్నాను లలితా! తిరిగి రావడానికి చాలా రోజులు పట్టవచ్చు. ఇంద—ఈ తాళాలు తీసుకో...నీ ఖర్చుకు కావలసిన డబ్బు, ఆ బీరువాలో ఉంది, పట్టుకెళ్లు' అన్నాడు శేఖరుడు.

ప్రతి సారి, లలితగూడా, వారి వెంట పశ్చిమదేశం వెడుతుండేది. అది రివాజు. క్రిందటి సారి ప్రయాణానికి, కావలసిన సామానులన్నీ, స్వయంగా, ఆమే సర్దింది. ఈసారి ఆ పనిని శేఖర్ ఒంటరిగా చేసుకొంటు న్నాడు. తెరిచిఉన్న పెట్టెను చూడగానే, ఆమె కీ సంగతి చప్పున జ్ఞప్తి కొచ్చింది.

శేఖరుడు, ఆమె నుండి దృష్టి మరల్చాడు. ఓ పాడి దగ్గు దగ్గి, గొంతు సరి చేసుకొని, 'జాగ్రత్తగా ఉండు లలితా! ఏదైనా ముఖ్యావ సరం కలిగితే, అన్నయ్య నడిగి నా చిరునామా తెలుసుకో. నాకు జాబు వ్రాయి.' అన్నాడు.

ఇద్దరూ మౌనంగా ఉండి పొయ్యారు. ఈసారి తమతోబాటు, తను రావడం లేదని శేఖర్‌దా గ్రహించాడని లలిత అనుకొన్నది. అలా రాక పోవ డానికి గల కారణం గూడా తెలుసుకొని ఉంటాడన్న ఆలోచన కలిగి నప్పుడు లలిత సిగ్గుతో క్రుంగి పోయింది.

'సరే! నువ్వింక వెళ్ళవచ్చు లలితా! ఇప్పటికే చాలా టైం అయింది. ఇంకా సామానంతా నేను సర్దుకోవాలి. అదీగాక—ఒకసారి ఆఫీసుకు గూడా వెళ్లి రావాలి.' అన్నాడు శేఖర్ బాబు నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

'నువ్వు వెళ్లి స్నానం చేసిరా శేఖర్‌దా!' అన్నది లలిత తెరిచిన పెట్టె ముందు కూచుంటూ. 'ఈలోగా ఇవన్నీ నేను సర్దుతాను.'

'మంచిది.' అన్నాడు శేఖరుడు తాళాలను లలిత ముందుకు గిరవా టేసి. గది బైటికి వచ్చిన వాడల్లా చటుక్కున ఆగిపోయి, వెనుదిరిగి లలి తను చూస్తూ అన్నాడు: 'లలితా! నాకేమేమి కావాలో నీకు తెలుసుగదూ? మరిచిపోకు. వాటి నన్నింటినీ జాగ్రత్తగా...'

లలిత ఆ మాట కేమీ జవాబివ్వకుండా, పెట్టెలోని వస్తువులను పరీక్షించ సాగింది.

శేఖరుడు సరాసరి తల్లి గదిలోకి వెళ్ళి, అన్నాకాళీ నుండి తను విన్న సంగతులన్నీ తల్లి నడిగి రూఢి పరచుకొన్నాడు. గురుచరణుడు అప్పు తీర్చినమాటా నిజమే! లలితకు సంబంధం కోసం, వారు ప్రయత్నిస్తున్న మాటా నిజమే! అతనింకేమీ మాట్లాడకుండా స్నానం చేయడానికి వెళ్ళాడు.

ఒకటి రెండు గంటలు గడిచాయి. శేఖరుడు తన స్నానాదికాలు పూర్తిచేసుకొని గదిలో కొచ్చి నిర్విణ్ణుడైనాడు. ఈ రెండు గంటల వ్యవధిలో లలిత చేసిన పనేమీ లేదు. తెరచిన పెట్టెకు తల ఆనించి, కొయ్యబొమ్మలా, అలానే కూర్చుండి పోయింది. శేఖరుని రాకతో ఆమె ఎవరో కొట్టినట్టు ఉలిక్కిపడి, తలెత్తి ఒక్షణం అతని ముఖంలోకి చూసి, తిరుగా తల వంచుకొన్నది. ఆమె కళ్లు జపాకుసుమాల లాగా అరుణిమను వెలారిస్తున్నవి.

ఈ సంగతి శేఖరుడు గమనించి కూడా, గమనించనట్లే నటించాడు. ఆఫీసు బట్టలు వేసుకొంటూ, సహజమైన కంఠస్వరంతో, 'లలితా! ఇప్పుడింక నువ్వు సర్దలేవు. వెళ్లు. మధ్యాహ్నం వచ్చి ఈ పని పూర్తిచెయ్యి.' అన్నాడు.

లలిత కళ్లు ఎందుకు ఎర్రవారాయో శేఖరునికి తెలుసు. కానీ, ఏ విషయాన్నీ సాకల్యంగా ఆలోచించని , మాట్లాడటం మంచిది కాదని, అనడానికి సాహసించలేదు.

ఆ రోజు మధ్యాహ్నం మామయ్యకు టీ తీసుకొచ్చిన లలిత కంగారు పడ్డది. అక్కడ శేఖరుడు కూచుని ఉండడమే అందుకు కారణం.

లలిత తలవంచుకొని, రెండు కప్పుల టీ తయారు చేసింది. ఒకటి మామయ్యకిచ్చి, రెండవది గిరీంద్రుని ముందు పెట్టింది. 'శేఖర్‌బాబుకు టీ తేలేదేం లలిత ?' అన్నాడు గురుచరణుడు.

'శేఖర్‌బాబు టీ త్రాగడు' అన్నది లలిత మెల్లగా.

గిరీంద్రుడేమీ మాట్లాడలేదు. అతనికి, లలిత కూడా టీ త్రాగకున్న సంగతి జ్ఞప్తికొచ్చింది. 'శేఖరుడు టీ త్రాగడు. ఇతరులను కూడా త్రాగనివ్వడు.' అనుకొన్నాడు గిరీన్‌బాబు.

టీ కప్పు నోటి దగ్గర పెట్టుకోబోతూ, గురుచరణుడు వరుని ప్రస్తావన తీసుకొచ్చాడు. కుర్రవాడు బి. య్యే. చదువుతున్నా డన్న వాక్యంతో ప్రారంభించి, అతని గుణగణాలన్నీ అభివర్ణించి, చివర కిలా అన్నాడు:

'ఏది ఏమైతేనేం గానీ, ఆ కుర్రవాడు గిరీన్‌బాబుకు నచ్చ లేదు. నిజానికి కుర్రవాడు అట్టే మాపరికాడు. కానీ నాయనా! మగవాళ్ళకు చక్కదనం మెందుకోయ్? కావలసింది సద్గుణాలు గానీ, సద్రూపం కాదు గదా!'

శేఖరునికీ, గిరీనుకూ ఇదే తొలి పరిచయం. శేఖరుడు అతని కేసి చూసి, మందహాసం చేస్తూ అన్నాడు: 'గిరీన్‌బాబు గారికీ సంబంధం ఎందు కని నచ్చలేదో? కుర్రవాడా బాగా చదువుకొన్న వాడాయె! స్థితిగతులు గూడా బాగా ఉన్నవాడనే అంటుంటిరి. ఇంతకంటే మంచి సంబంధం దొరకడం కష్టం గాదా?'

అడగడం గనుక అడిగాడు గానీ, ఈ సంబంధం గిరీనుకు ఎందుకు నచ్చలేదో, ఇక ముందుగూడా ఎందుకు నచ్చదో శేఖరుడు గ్రహించాడు. అయితే గిరీంద్రు డీ ప్రశ్నకు వెంటనే ప్రత్యుత్తర మివ్వలేదు. సిగ్గుతో అతని ముఖం ఎర్రవారింది. శేఖరు పది గమనించాడు. పోవడానికి లేస్తూ, 'బాబాయ్! రేపు అమ్మను దీసుకొని వైదేశం వెడుతున్నాను. సమయానికి కబురు చెయ్యడం మాత్రం మరిచిపోకు.' అన్నాడు.

'అదేమిటి శేఖర్‌బాబూ! మీరు తప్ప మాకిక్క డెవరున్నారూ? మాకున్న అండదండలన్నీ మీరేనయ్యె. అదీగాక—మీ అమ్మగారు లేనిదే, ఇక్కడ పెళ్ళి పను లెలా సాగుతా యనుకొన్నావ్? ఏమమ్మా లలితా! నువ్వేమంటావ్?' అన్నాడు గురుచరణుడు వెనక్కు తిరిగిచూస్తూ. 'అరే! ఎప్పుడో వెళ్ళిందే!'

'ఈ మాటలు రాగానే వెళ్ళిపోయింది!' అన్నాడు శేఖరుడు.

'వెళ్ళి పోక ఏం చేస్తుంది నాయనా? ఎలా అయినా జ్ఞానం వచ్చిన పిల్ల' అన్నాడు గురుచరణుడు ఓ నిట్టూర్పు విడిచి. 'లలిత—నిజంగా లలితే కాదు నాయనా! లక్ష్మి, సరస్వతులతో సమానమైన పిల్ల. ఎంతో అదృష్టవంతులకు గానీ, ఇలాంటి పిల్ల దొరకదు శేఖర్‌బాబూ!'

# 7

టీ పార్టీ నుండి చెప్పకుండా పారిపోయి వచ్చిన లలిత శేఖరుని గదిలో ప్రవేశించింది. గ్యాస్ లైటు వెలుతుర్లో అతని గుడ్డలు వగైరాలు పెట్టెలోకి సర్దనారంభించింది. మరి కొన్సేపటి కల్లా ఆ గదిలోకి శేఖరుడు గూడా వచ్చాడు. అతని ముఖం చూసి, ఆమె భయాశ్చర్యాలతో స్తంభితు రాలయింది.

వ్యాజ్యంలో సర్వస్వమూ ఓడిపోయి, అప్పుడే కోర్టునుండి వెలికి వచ్చిన వాని ముఖం ఎలా ఉంటుందో, గంట క్రిందట చూచిన వ్యక్తి గూడా, ఆ ఓడిపోయిన అతన్ని ఎలా గుర్తించలేడో, అలాగే, ఈ గంట సేపటిలోనూ శేఖరుని ముఖాన్ని లలిత గుర్తించలేక పోయింది. సర్వస్వమూ పోగొట్టుకొన్నవాని ముఖచిహ్నాలు, అతని వదనం మీద అచ్చు గుద్దినట్లు కనిపించ సాగాయి.

'లలితా! ఏం చేస్తున్నా విక్కడ!' అన్నాడు శేఖరుడు.

లలిత ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. అతనికి దగ్గరగా వచ్చి, రెండు చేతులతోనూ, అతని హస్తాన్ని పట్టుకొని, 'ఏం జరిగింది శేఖర్ బాబూ?' అన్నది రోదన స్వరంతో. 'ఎలా ఉన్నా నేమిటి?' అన్నాడు శేఖరుడు ప్రయత్న పూర్వకంగా నవ్వుతూ. లలిత హస్త సంస్పర్శతో అతనిలో నవచైతన్యం మోసులెత్తింది. దాపులో ఉన్న కుర్చీలో జారగిల బడి 'నువ్వేం చేస్తున్నావు లలితా?' అన్నాడు మళ్ళీ.

'ఇందాక—మీ ఓవర్ కోటు పెట్టెలో సర్దడం మరిచిపోయాను. అందుకనే మళ్ళా ఇప్పు డొచ్చాను.'

శేఖరుడు వింటూ కూచున్నాడు. లలిత తేరుకొని తిరిగి చెప్పసాగింది:

'క్రిందటి ప్రయాణంలో మీరు నానా బాధలూ పడ్డారు. మీకు కోట్లు చాలా ఉన్నాయిగానీ, కొంచెం మందంగా, మొద్దుగా ఉన్న దొక్కటీ లేదు. అందుకనే, పశ్చిమంనుండి రాగానే కొలతలిచ్చి, ఈకోటు కుట్టించాను.' అన్నది లలిత ఓ మొద్దుకోటును శేఖరు బాబుకు చూపెడుతూ.

'ఈ సంగతి నా కెప్పుడూ చెప్పలేదేం?'

'చెప్పలేదు.' అన్నది లలిత నవ్వుతూ. 'అబ్బో! మీరా దొరలై తిరి. ముందుగా చెబితే ఇలాంటి కోటు నన్ను కుట్టించ నిస్తారా? అందుకనే

గప్‌చుప్‌గా తయారు చేయించి అట్టే పెట్టాను.' కోటును యథాస్థానంలో ఉంచుతూ అన్నది. 'సరిగ్గా—ఇదిగో చూడండి! పైనే పెట్టాను. పెట్టె తీయంగానే కనిపిస్తుంది. చలి వేసినప్పుడు కోటు తొడుక్కోవడం మరిచి పోకండి.'

'సరే!' అన్నాడు శేఖరుడు. రెండు నిమిషాలు లలిత ముఖంలోకి చూస్తూ 'ఊఁహు...లాభం లేదు. అలా జరగడం అసంభవం!'

'తొడుక్కోవడమేనా అసంభవం?' అన్నది లలిత.

'కాదు కాదు.' అన్నాడు శేఖరుడు తడబడుతూ. 'నేను మాట్లాడింది; ఇంకో సంగతిని గురించి. సరేగానీ, సామాన్లు సర్దడం పూర్తయిందో లేదో, అమ్మను కనుక్కొన్నావా?'

'ఆఁ. మధ్యాహ్నం అవన్నీ నేనే సర్దాను.' అన్నది లలిత, ఒక్కమాటు వస్తువులన్నీ పరీక్షించి, పెట్టెకు తాళం వేసింది.

శేఖరుడో క్షణకాలం లలితకేసి చూశాడు.

'లలితా! వచ్చే సంవత్సరం, ఇలా నా సామానులన్నీ ఎవరు సర్దుతారో చెప్పగలవా?'

'ఎందుకు?' అన్నది లలిత శేఖర్ బాబుకేసి తిరిగి.

'ఎందుకో నాకు స్పష్టంగా తెలుసు' ననుకొన్నాడు శేఖరుడు. తను ప్రారంభించిన ఈ ప్రసంగాన్ని మార్చాలనే అభిప్రాయంతో, వాడిపోయిన ముఖం మీదికి బలవంతాన నవ్వు తెప్పించుకొనేందుకు ప్రయత్నిస్తూ, శేఖరు డిలా అన్నాడు:

'లలితా! పరాయి ఇంటికి పోకముందే, నాకో చిన్న ఉపకారం చేసి పెట్టు. ఏ వస్తు వెక్కడున్నదీ నాకు చూపించి వెళ్ళు. లేని పక్షంలో, అవసర మొచ్చినప్పుడు నాకేదీ దొరకకుండా పోతుంది.'

'పోండి' అన్నది లలిత కోపాన్నభినయించి.

ఇప్పటికి గానీ శేఖరుడు నవ్వలేదు.

'పోవాలని నాకూ తెలుసు లలితా? కాని దానికి మార్గ మేమిటో మాత్రం తెలియడం లేదు. నాకెంత ఉత్సాహమైతే ఉన్నదో, అంత సోమరితనం గూడా ఉన్నది. ఇలాంటి పనులు నౌకర్లు చాకర్లు చేయవల

సినవి కావు. వారివల్ల ఇవి నెరవేరనూ నెరవేరవు. పోతే—ఉన్న మార్గమల్లా ఒకటే! మీ మామగారిలా నేనూ, ఓ ఇక్కట్టులతో గడుపుకోవలసి వస్తుంది. సరే కానివ్వు. ఏదెలా జరగవలసి ఉన్నదో, అదలానే జరుగుతుంది గానీ మారదు గదా!' అన్నాడు శేఖరుడు నిరుత్సాహంగా.

తాళపు చెవులు మేజా మీదికి విసిరి, లలిత పరుగెట్టింది.

'లలితా! రేపు ఉదయం ఒక్కసారి కనబడు. తప్పదు.' అని కేక వేశాడు శేఖర్ బాబు.

లలిత విని కూడా, విననట్లే గబగబా డాబామీదికి వెళ్ళింది. అక్కడ అన్నాకాళీ, ఒక రాసి బంతి పూలు ముందేసుకొని దండ గుచ్చుతున్నది.

'మంచులో కూచుని ఏమిటి చేస్తున్నావే కాళీ?'

'దండ గుచ్చుతున్నాను వదినా.' అన్నది కాళీ ముఖం పైకెత్తకుండానే. 'ఇవాళ రాత్రికి మా అమ్మాయి పెళ్ళి జరగబోతున్నది'.

'మరి, ఇంతవరకూ నాకు చెప్పనే లేదేమే?'

'ఇప్పటివరకూ ఏదీ స్పష్టంగా నిశ్చయించుకోలేదు వదినా! ఇందాక నాన్నగారు పంచాంగం చూసి, ఇవాళ రాత్రి మించిపోయిస్తే, ఈ నెలలో ఇక ముహూర్తాలు లేవని చెప్పారు. పిల్లదా ఈడేరిందాయె! ఇక ఆపడానికా వీలు లేదాయె. ఎలాగో అలా పెళ్లి చేసి సాగనంపుతున్నాను. ఎంతకాలం ఈ బొమ్మల కుంపటిని భరిస్తాను వదినా? రెండు రూపాయలుంటే ఇవ్వు వదినా! మిఠాయిలూ అవీ కొనుక్కొస్తాను.'

'డబ్బు కావలసి వచ్చినప్పుడే వదిన కనిపిస్తుందన్నమాట' అన్నది లలిత చిరునవ్వు నవ్వుతూ. 'సరే వెళ్ళు. నా తలగడ క్రిందున్నాయి తీసుకో' అని రెండు క్షణాలాగి ఇలా అన్నది: 'అది సరేగానీ కాళీ! బంతిపూలతోటే పెండ్లి అవుతుందటే?'

'అవుతుంది' అన్నది అన్నాకాళీ గంభీరంగా. 'మరేపూలూ దొరకనప్పుడు బంతిపూలతోనే అవుతుంది వదినా! నేనెందరి పిల్లలనిలా విరగడ చేసుకొన్నాను గాదు? నా కన్నీ తెలుసు!' అని తినుబండారాలు తెచ్చేందుకు క్రింది కెళ్ళింది.

లలిత అక్కడే కూర్చుని దండ గుచ్చసాగింది.

కొంచెం సేపటికే అన్నాకాళీ పైకివచ్చి! 'అందరినీ పిలిచాను వదినా! ఒక్క శేఖర్ బాబునే పిలవాలి. వెళ్లి వారిని కూడా పిలుచు కొస్తాను. పిలవకపోతే, ఆయన మనస్సు కష్టపెట్టు కొంటాడు' అని తిరిగి క్రింది కెళ్ళిపోయింది.

అన్నాకాళీ పదహారణాల గృహిణి.అన్నిపనులూ సక్రమంగా జరుపు కొంటున్నది. ఆ పిల్ల శేఖర్ బాబును గూడా పిలచి వచ్చింది. 'శేఖర్ దాదకు ఓ పూదండ కావాలిట వదినా! వెళ్ళి ఇచ్చి రారాదూ? ఈలోగా ఇక్కడి ఏర్పాట్లన్నీ నేను చూస్తాను. ఇక ఆట్టే వ్యవధి లేదు. లగ్నం దగ్గరి కొచ్చింది.' అన్నదా పిల్ల.

'నేను వెళ్ళలేను కాళీ! ఆ పని నువ్వే చెయ్యి.'

'సరే! నేనే పోతాను గానీ, ఆ పెద్దదండ ఇలా ఇవ్వు.'

లలిత దండ ఇవ్వబోయి, మరుక్షణంలోనే మనసు మార్చుకొని, 'కాదులే కాళీ! నేనే వెళ్ళి ఇచ్చి వస్తాను.' అన్నది.

'అలాగే వెళ్ళు వదినా! నాకు లక్ష పను లున్నాయి. చద్దామన్నా తీరుబాటు లేకుండా ఉన్నది' అన్నది అన్నాకాళి పెద్ద ఆరిందా లాగా.

ఆ పిల్ల ముఖభంగిమ, మాటల తీరూ చూసి లలిత ఎంతో మురుసు కొన్నది. దండ తీసుకొని శేఖర్ బాబు గదిలో కెళ్లింది. అతను ఎటూ చూడ కుండా ఏదో ఉత్తరం వ్రాసుకొంటున్నాడు. లలిత అతని వెనుకకొచ్చి నిలబడింది. అయినా శేఖరు దది గమనించ లేదు. లలిత కో ఉపాయం తట్టింది. అతనికి తెలియకుండా ఈ దండ మెడలో వేస్తే ఎలా ఉంటుంది? ఎలా ఉంటుందో చూడాలన్న అభిప్రాయంతో, జాగ్రత్తగా, శేఖర్ బాబు తలకు తగలకుండా, ఛటుక్కున దండ అతని మెళ్లో వేసి, గభాలున కుర్చీ వెనుక నక్కింది లలిత.

శేఖరుడు ఉలిక్కి పడి 'ఏయ్ కాళీ!' అని గద్దించి, వెంటనే వెను దిరిగి లలితను చూశాడు. 'నువ్వు చేసిన పనేమిటి లలితా!' అన్నాడు గంభీరంగా.

'ఏం చేశాను?' అన్నది లలిత, అతని ముఖభావాలను చూసి సంకోచంతో.

'ఏమి చేసిందీ తెలియదా?' అన్నాడు శేఖర్‌బాబు గంభీరంగా. 'నీ కంతగా తెలియకపోతే, ఈ రాత్రి మళ్ళీ దండవేస్తే ఏమవుతుందో, వెళ్ళి కాళీని అడుగు.'

లలిత తను చేసిన పనేమిటో ఇప్పుడు గ్రహించింది. కనురెప్ప పాటులో ఆమె ముఖం సిగ్గుతో కందిపోయింది. తల అడ్డంగా తిప్పుతూ, 'కాదు కాదు. ఎప్పటికీ కాదు' అంటూ గదిలోంచి దూసుకెళ్లింది.

'లలితా! వెళ్ళకు! చిన్నమాట! విని వెళ్లు.' అని కేకేశాడు శేఖరుడు.

శేఖరుని పిలుపామెకు వినిపించింది. అయినా ఎక్కడా ఆగకుండా సరాసరి తన గదిలో కెళ్లి ప్రక్కమీద వాలిపోయింది.

అయిదారేళ్ళపాటు శేఖరుని సంరక్షణలో మెలిగిన లలిత ఎన్నడూ ఇలాంటి మాట అతని నోటంట ఎరుగదు. గంభీర స్వాభావుడైన శేఖరుడు గూడా, లలిత నెప్పుడూ హాస్యమాడి—అందునా ఇలాంటి లజ్జాకరంగా—హాస్యమాడి ఎరుగడు. ఆమె సిగ్గుతో కుంచుకుపోయి, చాలాగంట సేపలానే, ఆ ప్రక్కమీద పడుకొన్నది. శేఖరునిదగ్గర తెల్పడమా మానడమా అన్న ధర్మ సందేహ మామెను బాధిస్తున్నది. వస్తుత శేఖరుడంటే, లలితకు తగని భయం. అందులోనూ, ఇంత క్రితం ఏనాడూ ఊహించని సంఘటన జరిగింది. శేఖరుడేమో, ఏదో ముఖ్యమైన పని ఉన్నదన్నాడు. తనిప్పుడేమి చేసేట్టు!

'లలితమ్మగారూ! చినబాబుగారు మిమ్మల్ని రమ్మంటున్నారండీ!' అంటూ దాసీది వచ్చింది.

'నువ్వు పదవే! నే నిప్పుడే వస్తాను.' అన్నది లలిత.

మేడమీద కొచ్చి తలుపు సందుల్లోంచి చూసిం దామె. శేఖరుడింకా ఆ ఉత్తరాన్ని వ్రాస్తూనే ఉన్నాడు. లలిత కొంచెం సేపలానే ఉండి, తరువాత మెల్లిగా 'పిలిచారట-ఎందుకూ?' అన్నది.

'ఇలా దగ్గరకు రా, చెబుతాను' అన్నాడు శేఖరుడు వ్రాసుకొంటూ.

'కాదు. ఇక్కడే ఉంటాను, చెప్పండి!'

శేఖరుడు లోలోన నవ్వుకొన్నాడు.

'హఠాత్తుగా, నువ్విలాంటి పని ఎందుకు చేశావు లలితా?'

'పోదురూ!.. మళ్ళా ఆవేమాటలా?' అన్నది లలిత దొంగ కోపంతో.

'నువ్వు కోపగించుకోవడానికి, ఇందులో నేను చేసిన తప్పే మున్నది లలితా? చేసిందేదో నువ్వే చేశావు గాని...'

'నేనేమీ చెయ్యలేదు. నా దండ నాకు తిరిగి ఇచ్చేయండి.'

'ఆ పని చేదామనే నిన్ను పిలిపించాను లలితా! నువ్వే మా సగం క్రతువు జరిపి వెళ్ళావు. ఆ మిగతా సగ భాగాన్ని నన్ను పూర్తి చేయ నివ్వు. ఇలా దగ్గరకు రా లలితా!'

లలిత తలుపు వెనకనే ఓ క్షణం మౌనంగా ఉండి, చివరి కిలా అన్నది: 'నేనిది నిజంగా అంటున్నాను శేఖర్ దా! మీరీ విధంగా నన్ను వేళాకోళ మాడితే మాత్రం, ఇక మీ ముందు కెన్నడూ రాను. ఇప్పుడే చెబుతున్నా. నా దండ నాకు తిరిగి ఇచ్చేయండి.'

శేఖరుడు బల్లకేసి తిరిగి, దండను పైకెత్తి 'ఇదుగో లలితా! నీ దండను నువ్వు తీసుకెళ్ళు.' అన్నాడు.

'నేను రాను. మీ రక్కడ నుండే దాన్ని విసరండి.'

'లాభం లేదు. దగ్గరకొస్తేనే ఇస్తాను. లేకపోతే ఇవ్వను.'

'అలాగా! అయితే ఆ దండ నాకవసరం లేదు.' అని కోపంతో వెళ్ళిపోబోయింది లలిత.

'మరి క్రతువు సగంలోనే ఆగిపోయిందే!'

'ఆగితే ఆగిపోనీండి.'

ఈ సారి నిజంగానే కోపంతో వెళ్ళిపోయిందామె.

ఆ మాట నిజమే గానీ, ఆమె క్రింది కెళ్ళలేదు. సరాసరి మిద్దె తూర్పు వైపు కెళ్ళి, పిట్టగోడ పట్టుకొని నిలబడింది. వెండిముద్దలా చంద్రుడు మెల్లిగా పైకి ప్రాకుతున్నాడు. కన్నె నవ్వులాంటి తెరిపి వెన్నెలలో కొన్ని ఆవరించింది. పైన స్వచ్ఛమైన వినీల విహాయసం. ఎలా తేలా బోసున్నాయి చుక్కలు. ఆమె ఓ సారి శేఖరుని గదికేసి చూసింది. ఆ వెంటనే వినీల గగనంవేపు దృష్టి సారించింది. చిరుకోపంతోను, సిగ్గు

తోను, ఆమె కహాకహా లాడుతున్నది. ఆమె నయనాలు బాష్పపూరితా లయినాయి.

ఒకప్పుడైతే ఏమో గానీ, ఈ నాడు ఇలాంటి మాట తాత్పర్యం తెలుసుకోలేనంత అమాయికురాలు కాదామె. శేఖరుడు, తన మనస్సు భేదించే, అలాంటి పరిహాస మెందుకు చేయవలసి వచ్చింది? తనెంత హీను రాలో, తనెంతటి తుచ్ఛురాలో, ఈ క్షణాన తనకు తెలియ వచ్చింది. అనాథ అనీ, నిస్సహాయురాలనీ, నిరాశ్రయురాలనీ, తనను అందరూ ఆదరిస్తుంటారు. శేఖరుడూ అలానే ఆదరిస్తున్నాడు. అతని తల్లి భువనేశ్వరి కూడా ఈ అభిప్రాయంతోనే తనను ఆదరిస్తున్నది. ఆమెకు ఆత్మీయు లెవ్వరూ లేకపోవడం వల్లనే, నిజంగా తనకేమీ సంబంధం లేకపోయినా, ఆమెను ఉద్ధరించటానికి సంసిద్ధుడైనాడు గిరీంద్రుడు.

లలిత కన్నీరు తుడుచుకొంది.

ఈ నవనాగరిక కలకత్తా సమాజంలో, శేఖర్ బాబుతో పోల్చి చూచినప్పుడు, తన మామయ్య స్థితి ఏపాటిది? అలాంటి మామనే తను ఆశ్రయించుకొని ఉన్నది. అతని కొక గుదిబండలా తను తయారైంది. అక్కడ సమాన స్థితిమంతులతో, శేఖరుని వివాహ ప్రసక్తి చర్చించ బడుతున్నది. ఈ నాడు గాకపోయినా, మరో నాటికయినా, శేఖరుని కొ సంబంధమో, లేక ఆస్థాయికే చెందిన మరో సంబంధమో స్థిరపడుతుంది. ఇది యధార్థం. ఈ పెళ్ళిలో నవీన బాబుగారు, అనేక రూపాల వియ్యాం కులవారి నుండి, ఎంత డబ్బు గుంజా లనుకొంటున్నాడో, తను భువనేశ్వరి నోటంటనే విన్నది.

అవును గదా! అయినప్పుడు శేఖరుడు ఈ నాడెంత లజ్జాకరంగా తనెందుకు అవమానించాడు? ఆయనగారి అభిప్రాయ మేమిటి? లలిత శేఖ రుని గదికేసి సాలోచనగా చూస్తూ ఈ విషయాలను గురించి తీవ్రంగా ఆలోచించింది.

తన వెనక ఎవరిదో నవ్వు విని, లలిత వెనుదిరిగి చూచింది. శేఖరుడు పగలబడి నవ్వుతూ కనిపించాడు. ఇంత క్రితం, ఏ ఉపాయంతో, శేఖరుని మెడలో తను బంతి పూవండ వేసిందో, ఆ ఉపాయంతోనే శేఖరుడు,

అదే దండను, ఇప్పుడు ఆమె మెడలో వేశాడు. దుఃఖంతో బొంగురు పోయిన గొంతు సవరించుకొని 'ఎందుకిలా చేశారు శేఖర్ దా?' అన్నది లలిత.

'నువెందుకు చేశావ్?'

'నేనేమీ చెయ్యలేదు' అంటూ లలిత ఆ దండను త్రెంపివేయ బోయి, అతని కళ్ళకేసి చూసి, ఆగిపోయింది. ఇక త్రెంచివేసే సాహస మామెకు లేదు. కానీ ఏడుస్తూ 'శేఖర్ బాబూ! నేను నిస్సహాయురాలనీ, నాకెవ్వరూ లేరనేగా, మీ రిలా నన్ను అవమానం చేసింది?' అన్నది.

శేఖరుడు ఇంతవరకూ ముసి ముసి నవ్వులు నవ్వుతున్నవాడు కాస్తా, ఈ మాటలు విని, తెల్లబోయాడు. నిజమాలోచిస్తే ఇవి చిన్న పిల్ల లనవలసిన మాటలేనా?

'నేను నిన్నవమానించ లేదు లలితా! ఒకరకంగా నువ్వే నన్ను నన్ను అవమానించా వనుకొంటాను!'

'నేనా?' అన్నది లలిత భయపడుతూ. 'నేను మిమ్మల్ని నవమానించానా?'

శేఖరుడు ఓ క్షణం ఆగి తనను తాను సంబాళించుకొని అన్నాడు: 'కొంచెం ఆలోచించి చూస్తే, నిజా నిజాలు నీకే తెలుస్తాయి. అయినా, ఇటీవల నువ్వు మరీ బరితెగించి పోతున్నావులలితా! మాత్రకు వెళ్ళేముందు, నిన్ను అదుపులో ఉంచిపోతున్నాను.'

లలిత మాట్లాడకుండా తల వంచుకొని నిలబడి ఉంది. పండు వెన్నెల జగత్తుకు వెండి పూతలు పూస్తున్నది. శీతపవనం మందంగా, వీస్తూ సుగంధాన్ని వెదజల్లుతున్నది. అంతటా నిశ్శబ్దం. వారిద్దరూ అలానే మౌనంగా నిలబడి ఉన్నారు. 'బిడ్డ' పెళ్లి చేసుకొంటూ, అన్నాకాళీ వూదిన శంఖధ్వని, 'భోయ్' మంటూ క్రిందినుండి వినిపించింది. కాస్సే పలానే ఉండి శేఖరు డన్నాడు:

'లలితా! ఆట్టేసేపు ఇక్కడ నిలవకు. మంచు కురుస్తున్నది. లోపలి కెళ్ళు.'

'వెడుతున్నాను.' అన్నది లలిత, ఇంతసేపయ్యాక అతని కాళ్ళకు నమస్కరిస్తూ. 'నన్నేమి చెయ్యమంటారో చెప్పి వెళ్ళండి.' అన్నది మెల్లగా.

శేఖరుడు నవ్వాడు. ముందు కొంచెం తటపటాయించినా, తరువాత సాహసించేసు. రెండు చేతులతోనూ, లలిత ముఖాన్ని దగ్గరకు తీసుకొని, తనకు హత్తుకున్నాడు. ఆమె పెదవులను, తన పెదవులతో స్పృశించాడు.

‘లలితా! ఇక నీకు నేనేమీ చెప్పనవసరం లేదు. ఈ నాటినుండీ, నీకై నువ్వే అన్ని విషయాలూ తెలుసుకొంటావు.’

ఈ స్పర్శతో లలిత శరీరమంతా రోమాంచిత మయింది. నెత్తురు నాళాలనుండి ఉద్వేగంగా ప్రవహించింది. తనువంతా విద్యుదావేశిత మయినట్లు కాగా, ప్రయత్న పూర్వకంగా, కళ్ళు విచ్చి, అల్లంత దూరంగా జరిగి ఇలా అన్నది: ‘మీ మెడలో దండవేశాననేగా మీరిలా చేసింది?’

‘కాదు లలితా కాదు.’ అన్నాడు శేఖరుడు తల పంకిస్తూ. ‘నేనీ విషయాలను గురించి, చాలా రోజులనుండి ఆలోచిస్తూన్నానే గానీ, ఓ స్థిరమైన నిర్ణయానికి రాలేక పోయాను. ఇవ్వాళే ఆ నిర్ణయానికి వచ్చాను. ఎందుకంటే నిన్ను విడిచి ఉండలేనన్న మహా సత్యాన్ని నేనీరోజే గ్రహించాను.’

‘కానీ శేఖర్ దా! ఇది సుఖాంతం కాదనుకొంటాను. ఈ సంగతి తెలిస్తే మీ నాన్నగారు మండిపడతారు. అమ్మ దుఃఖిస్తుంది.’

‘లలితా! నువ్వన్నదాంట్లో నిజం లేకపోలేదు. నాన్నగారికి తెలిస్తే మండిపడతారు నిజమే గానీ, అమ్మ విని సంతోషిస్తుంది. ఏది ఏమైనప్పటికీ జరగవలసిందేదో జరిగిపోయింది. ఇక నువ్వు గాని, నేను గానీ తప్పించుకోలేము. పద. క్రిందికెళ్ళి అమ్మగారికో సారి నమస్కరించు.’ అన్నాడు శేఖర్ బాబు.

## 8

రెండు మూడు మాసాల తదనంతరం, ఒక నాడు గురుచరణుడు, దీనవదనంతో, నవీనరాయ్ గారింటి కెళ్ళి, తివాసీమీద కూర్చోబోయాడు. నవీనరాయ్ ఛీత్కరించుకొని ‘ఆఁ ఆఁ...ఆగాగు గురుచరణ్! నువ్వక్కడ కూచోబోకు. దయచేసి నువ్వా కుర్చీలో కూచో. సమయంగాని సమయంలో, నే నిప్పుడు స్నానం చేయలేను...ఆఁ...ఏమిటీ? నువ్వు మతం వదులుకొన్నావటగా? నిజమేనా?’ అన్నాడు.

గురుచరణుడు దూరంగా ఉన్న కుర్చీలో కూలబడి, తల వంచుకున్నాడు. నవీనబాబుగా రన్నమాట నిజమే! నాలుగైదు రోజుల క్రిందట గురుచరణుడు యథావిధిగా దీక్ష పుచ్చుకొని, బ్రహ్మసమాజంలో చేరాడు. ఈ వార్త చిత్ర విచిత్రమైన పరిణామాలకు గురయి, సనాతన హిందూ మతాభిమానియైన నవీనుని దాకా వచ్చింది. అతని కళ్ళు నిప్పుకలు రాలుస్తున్నాయి. కోపంతో నవీనుడు కుత కుత లాడిపోతున్నాడు. కాని గురుచరణుడు మాత్రం, తల వంచుకొని, అలాగే కుర్చీలో కూచున్నాడు. ఎవ్వరినీ సంప్రదించకుండా, గురుచరణు డీ పని చేసినప్పటి నుండీ, ఇంట్లో ఏడ్పులు, పెడబొబ్బలు అధికమై, అతనికి...మనశ్శాంతి లేకుండా పోయింది.

'చెప్పవోయ్ గురుచరణ్! నేను విన్నమాట నిజమేగదూ?' అని మళ్ళీ పృచ్ఛించాడు నవీనుడు.

గురుచరణుడు గ్రుడ్లనీరు గ్రుడ్ల కుక్కుకొంటూ, 'చిత్తం! నిజమే అన్నయ్యా!' అన్నాడు.

'ఎందు కిలాంటి పాడుపని చేశావ్ గురుచరణ్? నీ జీతమా అరవై రూపాయలు మించదయ్యే, నువ్వు...' ఆ పైమాటలు కోపంతో కుమిలిపోతున్న నవీనుడన లేకపోయాడు.

గురుచరణుడు కళ్లు తుడుచుకొన్నాడు. గొంతు సరిచేసుకొని ఇలా అన్నాడు: 'అప్పు డంతదూరం ఆలోచించనలే దన్నయ్యా! దుఃఖంతో కొట్టు మిట్టాడుతున్న ఆ సమయంలో, కంఠానికి ఉరివేసుకోవడమా? బ్రహ్మజ్ఞానిని కావడమా? ఏదీ నిర్ణయించుకోలేక పోయాను. చివరకు ఆత్మహత్య కంటే, బ్రహ్మజ్ఞానిని కావడమే ఉత్తమ మనుకొన్నాను.'

'ఉద్ధరించావు. నీ మెడకు ఉరితాడు తగిలించుకోవడానికి బదులు, జాతిమెడకు దాన్ని తగిలించావు. సరే, వెంటనే వెళ్ళిపో. నీ ముఖం, ఇక నా కెప్పుడూ చూపించకు. నీ కెవరు, ఇలాంటి ఘోరమైన సలహాల నిచ్చారో, వారితోనే ఉండు. ఊఁ వెళ్లు గురుచరణ్! ఇక ముందు, నువ్వి క్కడకు రానవసరం లేదు!'

గురుచరణుడు కళ్లు తుడుచుకొంటూ వెళ్లాడు, అతను వెళ్ళిన తరువాత, ముఖం అదోలా పెట్టుకొన్నాడు నవీనుడు,

కోపంతోను, అభిమానంతోనూ, మొదట ఏమి చెయ్యవలసిందీ నవీనునకు తెలియలేదు. గురుచరణుడు తన చేతినుండి పూర్తిగా తప్పించు కెళ్ళాడు. ఇక తిరిగి, తన హస్తాల్లోకి వస్తాడన్న ఆశగూడా లేదు. అందు చేతనే, నిష్ప్రయోజనమైన ఆక్రోశంతో నవీనుడు తపించి పోయాడు. అతన్ని 'గిరి' లో ఉంచదగ్గ ఉపాయ మేమీ స్ఫురించ లేదు. చివరికి, తాపీ మేస్త్రీకి కబురంపి, వారింటికి, తను ఇంటికీ, రాకపోకలు సాగించే దారిని మూయిస్తూ పెద్దగోడను కట్టించాడు.

గురుచరణుడు మతాన్ని మార్చుకొన్నాడన్న వార్త, దూరదేశంలో ఉన్న భువనేశ్వరి కొడుకు ద్వారా విని చాలా విచారించింది. 'నాయనా! గురుచరణునకీ దుర్బుద్ధి ఎవరు పుట్టించారురా?' అన్నదామె కొడుకుతో.

ఎవరు పుట్టించింది శేఖర్‌బాబుకు తెలును.అయినా ఆ సంగతి నతడు బెట పెట్టలేదు.

'పోనియ్ అమ్మా! ఇవ్వాళ గాకపోతే, మరో నెల రోజులకైనా, అతన్ని మీరు వెలివేసేవారు. ఇంతమంది ఆడపిల్లలు గల తండ్రి, వారి పెళ్ళిళ్లు ఎలా చేస్తాడో నాకు బోధపడకుండా ఉన్నది.'

'ఏపనైనా కాకుండా దిగబడదు శేఖర్! కేవలం,ఆడపిల్లల పెళ్ళిళ్లను గురించే జాతిని వదులుకోవడం—నేను హర్షించలేను. నారు పోసినవాడు, నీరుగూడా పోస్తాడు. వారిని పుట్టించిన భగవంతుడే, ఆ భారాన్ని గూడా వహిస్తాడు.' అన్నది భువనేశ్వరి.

శేఖరు డేమీ మాట్లాడ లేదు. భువనేశ్వరి కళ్లు తుడుచుకొంటూ, 'లలితను వెంట తీసుకొచ్చినట్లయితే, దాని భారాన్ని నేనే వహించవలసి వచ్చేది. అవసరమైతే, అందుకు కూడా నేను సిద్ధంగానే ఉన్నాను. గురు చరణుడు, ఈ అభిప్రాయాన్ని మనసులో అట్టే పెట్టుకొనే, లలితను పంపలేదని, ఇప్పు డనుకొంటున్నాను. నేను—అందరిలాగా, లలితకు సంబంధం కుదిరిందనే అనుకొంటున్నాను.' అన్నది.

శేఖరుడు తల్లికేసి చూసి సిగ్గు పడుతూ అన్నాడు: 'అమ్మా! ఇప్పటి కయినా మించిపోయిం దేమీ లేదు. మనం ఇంటికి వెళ్ళంగానే, ఈ విధంగా చేయడానికి అభ్యంతర మేమీ ఉండదనుకొంటాను. గురుచర ణుడు బ్రహ్మ సమాజంలో కలిశాడు గానీ, లలిత ఇంకా ఆ సాహసం

చెయ్యలేదు. నిజంగా-లలిత ఆయనగారికి దగ్గర బంధువు కూడా కాదు. ఆమె దిక్కు లేనిది కాబట్టే, వారింట్లో ఉంటున్నదన్న సంగతి, నీకు తెలుసను కొంటాను.!'

'నిజమే కానీ—' కాస్సేపు ఆలోచించి అన్నది భువనేశ్వరి. 'మీ నాన్నగారిదో విచిత్రమైన పద్ధతి శేఖర్ బాబూ! ఆయనగారెందుకు, ఏ మాత్రం అంగీకరించడు. వాళ్ళతో మాట్లాడ నివ్వకపోవడం సరే, వారి ముఖం కూడా చూడనివ్వడు.'

శేఖరుని కూడా ఈ సందేహమే కలిగింది. అతడిక ఏ మాటా మాట్లాడకుండా, బైటికి వెళ్ళిపోయాడు. అతని మనస్సు నానా కంగాళీగా ఉన్నది. స్థిరంగా ఒకచోట కూర్చోలేక పోయాడు. రెండు మూడు రోజులిలా గడిచాయి. ఒకరోజు సాయంకాలం భువనేశ్వరి వద్దకొచ్చి, 'అమ్మా! నా కెక్కడేమీ బాగుండడం లేదు. ఇంటికి వెడదామనుకొంటున్నాను!' అన్నాడు.

భువనేశ్వరి అందుకు అంగీకరించింది.

ఇద్దరూ ఇంటి కొచ్చారు. పరిస్థితిని తెలియచేస్తూ, కొత్తగా కట్టిన గోడ భయంకరంగా కనిపించింది. గురుచరణుని కుటుంబంతో సంబంధం పెట్టుకోవడం, భగవంతునికి తెలుసు; కనీసం వారిని చూడను కూడా చూడరాదన్న విషయాన్ని, మరొకరు చెప్పకుండానే వారు గ్రహించారు.

ఆ రాత్రి శేఖర్ భోజనం చేస్తున్నప్పుడు, భువనేశ్వరి దాపులో కూర్చుని మాట మీద మాటగా, 'శేఖర్! వాళ్ళలలితను, గిరీంద్రుని కివ్వాలన్న సంప్రదింపులు జరుగుతున్నాయట. ఇలాంటిది జరుగుతుందని, నే నేనాడో అనుకొన్నాను.' అన్నది.

'ఈ సంగతి నీ కెవరు చెప్పారమ్మా?' అన్నాడు శేఖర్.

'గురుచరణుని భార్య చెప్పింది. మధ్యాహ్నం మీ నాన్నగారు నిద్రపోతున్నప్పుడు, నేనే ఒకసారి వారింటికెళ్ళి వచ్చాను. నే నక్కడ కూచున్నంత సేపూ, ఆమె కంటికీ, మంటికీ, ఏకధారగా ఏడ్చింది.' అన్నది భువనేశ్వరి ఓ క్షణమాగి. 'ఇన్నిటికీ అదృష్టముండాలి నాయనా! అదృష్టముండాలి. నొసట వ్రాసిన వ్రాతను ఎవ్వరూ చెడగొట్టలేరు. మార్చనూలేరు. మన మెవ్వరినీ తప్పు పట్టకూడదు. జరిగినదేదో జరిగిపోయింది. ఇప్పుడేమను

కొన్నా లాభం లేదు. గిరీంద్రుడు కూడా ఉత్తముడే! ఆస్తిపరుడు కూడాను. ఆ యింటబడితే లలితకేమీ కష్టముండదు.'

శేఖరు డేమీ మాట్లాడ లేదు. కాస్సేపాగి తల్లి వెళ్ళిపోయింది. శేఖరుడు కూడా చెయ్యి కడుక్కుని లేచి, తన గదిలోకెళ్ళి పడుకొన్నాడు.

ఆ మరునాటి సాయంత్రం శేఖరుడు షికారు బయలుదేరాడు. గురుచరణుని ముందు గదిలోనించి, టీపార్టీ తాలూకు, మాటలు, పకపకలు, వికవికలూ, వినిపించాయి. అతడో క్షణం నిలబడి ఆలోచించాడు. మరుక్షణంలోనే, గురుచరణుని ముందు గదిలోకొచ్చాడు. అంతవరకూ, కోలాహలంగా ఉన్న ఆ గదిలో, ఒక్కసారి నిశ్శబ్దం అలముకొన్నది. అతన్ని చూడగానే, అందరి ముఖాలు మారిపోయాయి. శేఖరుడు ఊరినుండి తిరిగి వచ్చాడన్న విషయం, ఒక్క లలితకు మాత్రమే తెలుసు.

ఇవ్వాళ గిరీంద్రునితో బాటు మరో యువకుడు కూడా అక్కడున్నాడు. ఆ యువకుడు ఆశ్చర్యంతో శేఖరునికేసి చూడసాగాడు. గిరీంద్రుడు గంభీరంగా ముఖం పెట్టి గోడవంక చూస్తున్నాడు. అందరిలోకీ పెద్దగా అయిస్తున్నాడు గురుచరణుడు. శేఖర్ బాబును చూస్తూనే అతని ముఖం ఎలా తెలా పోయింది. అతని ప్రక్కనే టీ కలుపుతున్న లలిత, ముఖమెత్తి, ఒక్కసారి శేఖర్ బాబును చూసి, తిరిగి వంచుకొన్నది.

శేఖరుడు ముందుకొచ్చాడు. బల్లమీద తల ఆనించి నమస్కరించాడు. కుర్చీలో కూర్చుంటూ, 'అదేమిటి? అంతా ఒక్కసారే చల్లబడి పోయిందేం?' అన్నాడు.

గురుచరణుడు మెల్లగా ఆశీర్వదించి ఉంటాడు; కానీ అతనేమన్నదీ స్పష్టంగా, ఎవ్వరికీ వినిపించలేదు. శేఖరుడు వారి మనోభావాలను గ్రహించాడు. కాలం గడవడానికై స్వంత గొడవలు చెప్ప నారంభించాడు. నిన్న ఉదయం తను ఏ బండిలో ఇక్కడికొచ్చాడో, తల్లి ఆరోగ్యం ఎలా ఉన్నదో, పశ్చిమ దేశ విశేషాలేమేమిటో అనర్గళంగా చెప్పుకెళ్ళాడు. చివరికీ, ఆ నూతనాగంతకునివైపు చూశాడు.

గురుచరణుడు ఈ వ్యవధిలో తెప్పరిల్లుకొని, ఆ యువకుణ్ని పరిచయం చేశాడు.

'శేఖర్ బాబూ! ఇతను మా గిరీంద్రుని మిత్రుడు. ఇద్దరి ఇళ్ళూ ఒక్కచోటే ఉన్నాయి. ఇద్దరూ కలిసి చదువుకొన్నారు. చాలా వుత్త

ముడు. శ్యాం బజారులో ఉంటున్నాడు. మాతో పరిచయం కలిగి నప్పటి నుండీ, రోజూ కోసారైనా వస్తుంటాడు.'

'అవును. ఉత్తముడు' అనుకొన్నాడు శేఖర్ బాబు, మనస్సులో. పైకిమాత్రం 'బాబాయ్! అందరూ క్షేమమే గదూ?' అన్నాడు.

గురుచరణుడు సమాధాన మివ్వకుండా తల వంచుకోవడం చూసి, శేఖర్ పోవడానికి లేచాడు. గురుచరణుడు రుద్ధ కంఠంతో 'నాయనా! అప్పుడప్పుడు నువ్వయినా వస్తుండు. కేవలం వదిలి పెట్టకు. సంగతులన్నీ విన్నావు గదా' అన్నాడు.

'ఆఁ, విన్నాను' అన్నాడు శేఖరుడు లోపలి కెడుతూ.

లోపలినుండి గృహిణి రోదన వినిపించింది. గురుచరణుడు పై పంచెతో కన్ను లద్దుకొన్నాడు. గిరీంద్రుడు ఏదో అపకారం చేసినవాని లాగా, మౌనం ధరించి, కిటికీలో నుండి బైటికి చూస్తున్నాడు. లలిత, అక్కడినుండి ఎప్పుడో వెళ్లిపోయింది.

కొంచెం సేపయాక, శేఖరుడు వంటింటి నుండి మెల్లాలోకి వస్తుండగా, తలుపుచాటున, చీకట్లో నిలబడిఉన్న లలితను చూశాడు. లలిత అతనికి సాష్టాంగ నమస్కారం చేసి. ఏదో ఆశిస్తున్నదానిలా, శేఖరునికి దగ్గరగా వెళ్లింది. క్షణకాలం ఘనీభవించింది. లలిత రెండడుగులు వెనుకకు వచ్చి, 'శేఖర్ బాబూ! నా ఉత్తరానికి మీరు జవాబివ్వలే దెందుచేత నండీ?' అన్నది.

'నాకు, నీ ఉత్తరం అందలేదు లలితా! అయినా ఏమని వ్రాశావేం?' అన్నాడు శేఖర్ బాబు.

'చాలా సంగతులు వ్రాశాను శేఖర్ బాబూ! అవన్నీ విడిచి పెట్టండి. అంతా మీరు విన్నారుగా! ఇప్పుడు నన్నేమని ఆజ్ఞాపిస్తున్నారో వినాలనుకొంటున్నాను.'

'నా ఆజ్ఞా?' అన్నాడు శేఖరుడు ఆశ్చర్యపడి. 'ఇప్పుడు నాఆజ్ఞతో ఏంపని లలితా?'

లలిత సంకోచిస్తూ శేఖరుని వైపుచూసి, 'ఎందుకని శేఖర్ దా?' అనడిగింది.

'ఎందుకీ కేకలటి లలితా? నేనెవరిని ఆజ్ఞాపిస్తాను!'

'ఎవరినో కాదు, నన్ను'

'నిన్ను మాత్రం నేనెందుకు ఆజ్ఞాపించుతాను లలితా? ఒకవేళ, ఆజ్ఞాపించినా, నువ్వు దానికి కట్టుబడి వుంటావా?' అన్నాడు శేఖరుడు గంభీరంగా.

లలిత భయపడింది. ఆమె శేఖరునికి మరింత దగ్గరగా వచ్చి ఇలా అన్నది: 'పోండి...ఇలాంటి విషమ సమయంలో కూడా హాస్యాలాడడం నాకు బావుండదు. మీ కాళ్ళమీద పడతాను. నన్నేం చేయమంటారో చెప్పండి. మీరేది చేయమంటే, దాన్ని చేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఈ భయంతో రాత్రిళ్ళు, నేను సరిగా నిద్రకూడా పోవడం లేదు.'

'భయం దేనికి లలితా?'

'భయం దేనికా?' అన్నది లలిత తమాషాగా. 'మీరూ ఇక్కడలేరాయె. అమ్మకూడా లేదాయె. ఈలోపున, మామగారేమో ఈపనికాస్తా చేసుకూర్చున్నాడు...ఇప్పుడు అమ్మ నన్ను ఇంట్లోకిరానివ్వకపోతే...'

శేఖరుడు క్షణకాలం మౌనంగా ఉన్నాడు:

'నిజమే లలితా! అమ్మ నిన్నిప్పుడు ఇంట్లోకి రానివ్వదు. మీ మామ ఇతరుల దగ్గర చాలా డబ్బు తీసుకొన్నాడని అమ్మకు తెలుసు. అదీగాక-మీరిప్పుడు బ్రహ్మసమాజీయులు, మేము హిందువులం!'

ఇంతలో వంటింట్లో నించి 'వదినా! అమ్మ నిన్ను పిలుస్తోంది' అని కేక పెట్టింది అన్నాకాళీ.

'వస్తున్నాను.' అని బిగ్గరగా ఆ కేకకు సమాధానమిచ్చి, శేఖర్‌తో మెల్లగా అన్నది: 'మామ ఏ మతస్థుడైనా కానివ్వండి, నాది మాత్రం మీమతమేదో, అదే! అమ్మ మిమ్మల్ని వదులుకో లేకపోతే, నన్నూ వదులుకోలేదు. పోతే గిరీంద్రుని దగ్గర డబ్బు తీసుకొన్న సంగతంటారా? ఆ బాకీని నేను తీర్చేస్తాను. అప్పుపుచ్చుకొన్న తరువాత, రెండురోజులు వెనుకా ముందుగా తీర్చవలసిందే గదా!'

'అంత డబ్బు, నీకెక్కడినుంచి వస్తుంది లలితా?' అన్నాడు శేఖరుడు.

లలిత ఓ క్షణం శేఖరుని ముఖంలోకి చూసి, 'నాకూ తెలియదు. కానీ స్త్రీలందరకూ, ఎక్కడినుండి డబ్బు వస్తుందో, నాకూ అక్కడి నుండే వస్తుంది!' అన్నది.

ఇంతవరకూ శేఖరుడు లోలోపల నుండి పోతున్నా, బైటపడకుండా నిగ్రహించు కొంటున్నాడు. ఇప్పుడిక ఎగతాళిగా, 'మీమామ నిన్ను అమ్మేశాడుగా లలితా!' అన్నాడు శేఖరుడు.

చీకటిలో, అతని ముఖ భావాలను లలిత గమనించక పోయినా, కంఠ స్వరంలోని మార్పును కనిపెట్టింది. ఆమె దృఢ స్వరంతో ఇలా అన్నది:

'ఆ సంగ తులన్నీ ఉత్త అబద్ధాలు. మీరు వాటిని విశ్వసించకండి. మామయ్య లాంటి మనుషులు, ఈ ప్రపంచంలో చాలా తక్కువమంది ఉంటారు. వారిని మీరు అపహాస్యం చేయకండి. ఆయనపడిన కష్టాలు మీరు తెలుసుకో లేకపోయారు గానీ, లోకానికి తెలుసు' ఈమాటలని ఓగుటక వేసి, కొంచెం సందేహిస్తూ అన్నది: 'అదీగాక, మామయ్య డబ్బు తీసు కొన్నది నా పెళ్ళి అయిన తరువాత. అందుచేత నన్ను అమ్మే హక్కు మామయ్యకు లేనూలేదు; ఆ అఘాయిత్యం ఆయన చెయ్యనూ చెయ్యడు. ఆ అధికారమున్నదల్లా మీ ఒక్కరికే! డబ్బునివ్వవలసి వస్తుందన్న భయంతో, నన్ను అమ్మదలచుకొంటే మాత్రం, మీరు అమ్మివేయ గలరు.'

ఈమాటలని జవాబుకోసం ఆగకుండా, తొందరగా వెళ్ళిపోయింది.

## 9

ఆనాటి రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా వీధుల వెంట తిరిగిన శేఖరుడు ఇంటికి రాగానే ఆలోచనా సముద్రంలో ఈదులాడ సాగాడు. నిన్న గాక మొన్న పుట్టిన లలిత, ఇంత ఆరిందామాటలు ఎలా నేర్చుకొన్నది? ఎక్కడ నేర్చుకొన్నది? సిగ్గుబిడియాలు వదిలి, తన ఎదట ఇలా ఎట్లా మాట్లాడ గలిగింది?

ఈనాటి లలిత ప్రవర్తించిన విధానం శేఖరుని కెంతో క్రోధాన్నీ ఆశ్చర్యాన్నీ కలిగించింది. వీటికి మూలకారణ మేమిటోనని అతను శాంతంగా ఆలోచించ లేదు. ఆలోచించి నట్లయితే, ఆకోపం లలితమీద కాక, తనమీద తనే కోపగించుకొన్నట్లు అతను గమనించి ఉండే వాడు.

లలితను విడనాడి 'ప్రవాసం'లో ఉన్న ఈకొద్ది నెలలూ శేఖరుడు కల్పనా రాజ్యంలో విహరించాడు. కాల్పనికమైన కష్టసుఖాలను, లాభనష్టాలను బేరీజు వేసి, చూసుకొన్నాడు. తన భావిజీవిత మంతా లలిత మీద ఆధారపడి ఉన్నదనీ, ఆమె లేకుండా మనగలగడం దుస్సహామనీ, తేల్చుకొన్నాడు. లలిత తన బాల్యమంతా తమ ఇంట్లోనే గడిపి వేసింది. ఈ ఇంట్లో ఆమెకున్న స్థానమేమిటని శేఖరుడేనాడూ ఆలోచించ లేదు. అలా ఆలోచించవలసిన అవసరంగూడా రాలేదు. ఇక లలిత తనకు దక్కదు. ఈ వివాహానికి తన తల్లిదండ్రులు అనుమతించరు. ఆమె-ఈనాడే గాదు; మరోనాటికైనా మరొకరి సొత్తుకావలసిందే! ఈ విచారమే శేఖర్ బాబును అనునిత్యం పట్టి పల్లార్చుతుండేది. ఆకారణంచేతనే, అతను కలకత్తా వదిలి తల్లితో సహా దూరదేశం పోతున్నప్పుడు, ఆనాటి రాత్రి, ఆమె మెడలో పూదండవేసి, తనను వెన్నాడుతున్న ఆ విచారానికి అడ్డుకట్ట కట్టాడు.

ప్రవాసంలో ఉన్నప్పుడే గురుచరణుడు, బ్రహ్మమతా వలంబి అయినాడన్న వార్త విని, లలిత ఇక తనకు లభింపబోదన్న బాధతో విలవిలలాడాడు శేఖరుడు. అతని సుఖదుఃఖ సంబంధమైన ఆలోచనలన్నీ లలిత పరంగానే ఉండేవి. కానీ ఈరోజు లలిత చెప్పిన మాటలు, శేఖరుని భావవాహినివి ఎదురొడ్డిని ప్రవాహగతిని వేరొకదిక్కుకు మరలించాయి. ఆనాటి చింత-ఇక లలిత తనకు దక్కదని. కాగా, ఈనాటి చింత ఇక లలిత తనను వదలదేమోనని.

లోగడ శేఖరుని కిస్తానన్న శ్యాంబజారు సంబంధం తప్పిపోయింది. వారంత కట్నమిచ్చుకోలేమని తెగేసి చెప్పారు. దీనికితోడు భువనేశ్వరికి పిల్లగూడా నచ్చలేదు. ఈకారణాలవల్ల ఈసంబంధపు ఉచ్చునుండి, శేఖరుడు తాత్కాలికంగా తప్పించుకొన్నాడు. కానీ, నవీనరాయ్‌గారు మాత్రం ఇరవై వేల కట్నం మాట మరిచిపోలేదు. ఆయనగారింకా ఆ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఇప్పుడేమి చెయ్యాలన్న ఆలోచనతో శేఖరుడు సతమతమయి పోతున్నాడు. ఆనాటి రాత్రి తను చేసిన స్వల్పకార్యం, ఇంతగా పీకమీదికొస్తుందనీ, ఏవిధంగానూ ఇది మారడానికీ వీలులేదనీ, తనకు వివాహమయిపోయినట్లు, ఈకారణాన్ని పురస్కరించుకొని లలిత, నిశ్చయించుకో

గలదనీ, తనా స్వల్ప కార్యం చెయ్యబోయే ముందు అనుకోలేదు. ఇలాంటి విపత్తులు దీనివలన రాగలవన్న వాసన ఏమాత్రం వచ్చినా, తను ఆపని చేసి ఉండకపోయే వాడేమో! జరగవలసిందేదో జరిగిపోయింది. 'లలితా! దీని నుండి నువ్వుగానీ, నేనుగానీ, ఇక తప్పుకోలేము' ఇవీ తను ఆనాడన్న మాటలు. ఈనాడా మాటలను గురించి, ఆలోచించినట్లైతే, ఆనాడూ ఆలోచించి చూసుకోనేటంత శక్తి తనకు లేదు. ఆ సమయంలో, వెండి ముద్దలాంటి చంద్రుడు ఆకసంలో వెలుగుతున్నాడు. కన్నె నవ్వువంటి వెన్నెల లోకాన్ని ఆవరించి ఉన్నది. ప్రకంపిస్తున్న ప్రియురాలి వక్షున్ని తనహృదయానికి హత్తుకొని, ప్రథమ ప్రణయం తాలూకు, మధురానుభూతిని పొందాలన్న తీవ్ర మోహంతో **తను** తపించి పోతున్నాడు. ప్రియులు అధరామృతమని చెప్పుకొనే దేదో, దానిని పొందాలన్న తీవ్రకాంక్ష ఉన్నది. అప్పుడు శేఖరునిలో ఉన్నది; కేవలం స్వార్థం. సంఘపరమైన ధర్మాధర్మాలు గానీ, న్యాయా న్యాయాలుగానీ, అతని స్మృతికి రాలేదు. కేవలం డబ్బుకోసమే జీవిస్తున్న తండ్రి వికృతరూపం అతని కళ్ళకు కనిపించ లేదు. లలితపట్ల భువనేశ్వరికి అనురాగమున్నది గనుక, ఆమె నెలాగో అంగీకరింప చేయవచ్చుననుకొన్నాడు. అన్నచేత చెప్పించి, తండ్రి నింగుకు ఒడబరచవచ్చునుకొన్నాడు. అన్నిటికంటే ముఖ్యం; గురుచరణుడు తాను నాశనమయి, తన ఆశాపథానికి తోకచుక్కలా ఎదురవ లేదు. ఇప్పుడవన్నీ జరిగాయి. ఈవేదనా పరంపరనుండి తనకు విముక్తి కలిగించగలిగిన దాని విధాత ఒక్కడే!

ఒకరకంగా చూస్తే, ఈసమస్యలను గురించి శేఖరు డింతగా మల్లగుల్లాలు పడనవసరం లేదు. తండ్రిని అంగీకరింప చేయడాన్ని అలా ఉంచి; ముందు తల్లినే ఇందుకొప్పించడం అసంభవమని అర్థం చేసుకొన్నాడు. అసలు, తలిదండ్రుల దగ్గర ఈప్రస్తావన తెచ్చేమార్గాలు గూడా మూసుకు పోయాయి.

శేఖరు డొకసారి దీర్ఘంగా నిట్టూర్చాడు. 'ఏమి చెయ్యాలి?' అన్న ప్రశ్నను మరొకసారి తనకు తను వేసుకొన్నాడు. లలిత తనకు తెలిసినంత స్ఫుటంగా మరెవ్వరికీ తెలియదనడం అతిశయోక్తి కాదు. తను దేనిని న్యాయమని, ధర్మమని ఆమె విశ్వసిస్తుందో, ఆజన్మాంతం వాటినలానే నమ్ముతుంటుంది. ఆ నిర్ణయంనుండి ఆమెను తప్పించడం ఎవ్వరివల్లా కాదు.

ఒకసారి శేఖరుడు తనభర్తవుడని మనఃపూర్వకంగా ఆమె నమ్మింది. నమ్మింది గనుకనే ఆమునిమాపు చీకటివేళ, నిస్సంకోచంగా తనదగ్గరకు జరిగి, ముఖంలో ముఖం పెట్టి, అంత స్వేచ్ఛగా మాట్లాడ గలిగింది.

ఒక ప్రక్క లలితను గిరీంద్రునికిచ్చి పెండ్లిచేయాలన్న ఆలోచనలు ప్రబలంగా జరుగుతున్నాయి. కాని లలిత అంగు కంగీకరించడం లేదు. ఏకారణానో ఇంతవరకూ ఆమె తను మధ్యగల రహస్యాన్ని కాపాడుతూ వచ్చింది. అలా ఇక ఎక్కువకాలం, ఆమె ఆ రహస్యాన్ని దాచను. దాచ బోను. ఎప్పుడో ఒకప్పుడు బహుశః త్వరలోనే కావచ్చు; తమ మధ్య జరిగిన ఈ తతంగమంతా ఆమె నలుగురి ఎదుటా పెడుతుంది. అప్పుడు తనేమయిపోతాడు? ఈవిషయం తలపుకొచ్చి శేఖరుడు కంపించి పోయాడు. అతని ముఖం కందిపోయింది. కళ్లుభీతితో దీప్తిమంతా అయినాయి. తను ఒకటి కాదు; వరుసగా రెండు పొరబాట్లుచేశాడు. దండ వెయ్యడంతోనే తను ఊరుకో లేదు. ఆమెను ఆలింగనం చేసుకొన్నాడు. చుంబించాడు గూడానూ. ఇలా చేస్తున్నప్పుడు ఆమె అభ్యంతర పెట్టలేదు. ఇది దోషం కాదన్న అభిప్రాయంతోనే, ఆమె అడ్డుపెట్టకపోయి ఉండాలి. ఇవన్నీ లలిత బహిరంగ పరచడమే జరిగితే, వీటికి తనేమని సమాధాన మివ్వాలి?

తల్లి దండ్రుల అనుమతి లేకుండా లలితను తను పెళ్ళాడటం అసంభవం! ఇందులో సందేహించ వలసిం దేమీ లేదు. కానీ గిరీంద్రుణ్ని తను ఎందుకు పెండ్లాడ నంటున్నదో లలిత చెప్పినప్పుడు; తను ఇంటగానీ, బైటగానీ ముఖమెత్తుకొని తిరగ గలడా?

## 10

తల్లి దండ్రులను తన వివాహ విషయంలో సమ్మతింప చేయడం అసంభవ మన్న అభిప్రాయంతో, లలితపట్ల తనకుగల ఆశాలవాన్ని పూర్తిగా త్రెంచేసుకొన్నాడు శేఖర్ బాబు. ఏక్షణాన లలిత తనప్రక్క కొచ్చి కూర్చున్నా కూర్చోవచ్చునని, ఎప్పుడు తమ రహస్యం వెల్లడిచేసినా చేయ వచ్చునీ, లలితను గురించి కొంతకాలం పాటు మహాభయపడ్డాడు శేఖరుడు. అలాంటిదే జరిగినప్పుడు, తనివ్వవలసిన జవాబేమిటని గూడా అతను మధన పడ్డాడు. అదృష్టవశాత్తూ, ఇంతవరకూ, అతని నావిషయమై ఎవ్వరూ అడుగనూ లేదు. అతను చెప్పనూ లేదు. అసలా విషయం వెల్లడి కాబడిందో

లేదో కూడా అతనికి తెలియదు. అటువారు ఇటుగానీ, ఇటు వారటుగానీ రాకపోకలు సాగించడం లేదు. శేఖర్ గది ముందుగల ఖాళీ స్థలంలోకి వెళ్ళిచూస్తే, గురుచరణుని డాబా మొత్తమూ, అందులో ఉంటున్న మనుషులూ కనిపిస్తారు. అక్కడి కెడితే, లలిత కనిపిస్తుం దేమోనన్న భయంతో, చాలా కాలం శేఖరుడా మైదానంలోకి వెళ్ళలేదు. కానీ అలాంటి గొడవలేమీ లేకుండా ఓ నెల రోజులు గడిచిపోయాక, శేఖరుని ప్రాణం కుదుట బడ్డది.

'ఆరు నూరయినా, నూరు ఆరయినా, ఆడవారు, ఆంతరంగిక రహస్యాలను బైట పెట్టరు. పురుషులంత 'ఇది'గా వారు సిగ్గు భిడియాలను వదిలి పెట్టరు.' అనుకొన్నాడు శేఖరుడు. ఆడవారు, హృదయం బ్రద్ద లయి పోతున్నా నరే, నోరువిప్పరని, తనెప్పుడో విన్నాడు. లలిత ద్వారా ఈనాడది నిజమేనని రుజువు చేసుకొన్నాడు. సృష్టికర్త స్త్రీలలో ఇటువంటి దుర్బలత్వాన్ని ఆశక్తతను ఏర్పరిచినందుకు, ప్రణామ సహస్ర మర్పించాడు.

కానీ శేఖరుని మనస్సుకు శాంతిలేకుండా పోయింది. లలిత వలన తన గౌరవజీవితాని కేవిధమైన భంగమూ రాదని తేలిపోయినప్పటి నుండీ, అతని మనస్సు, వ్యథతో కుమిలిపోతున్నది. అయితే, ఈ రహస్యాన్ని లలిత ఏనాడూ, ఎక్కడా వెల్లడించదా? వివాహ మయ్యేంత వరకూ, ఇలా మౌనంగానే ఉండిపోతుందా? ఆమెకు వివాహమయిందనీ, కాపురం చేసేందుకు అత్తగారింటి కెళ్ళిందనీ—ఇలాంటి సంగతులు తలపుకొచ్చేసరికి అతని మనస్సు, శరీరమూ, బడబాగ్నిలో చిక్కుబడి పోయినట్లు, కహకహ లాడుతున్నాడు.

ఇదివరకు సాయంత్రపు వేళ షికారు కెళ్ళకుండా, గదిముందు పచారు చేస్తుండేవాడు. ఇవ్వాళ కూడా అలానే తచ్చాడుతున్నాడు. ఒట్టుపెట్టినట్లు ఒక్కనాడు కూడా, గురుచరణుని కుటుంబీకులు డాబా మీద కనిపించలేదు. ఎప్పుడో ఒకసారి మాత్రం, అన్నాకాళీ ఏదో పని మీద డాబాపై కొచ్చింది. ఆమెను పలకరించడమా, మానడమా అన్న విచికిత్స ఇంకా తేలకముందే, ఆ పిల్ల పిట్టలా పారిపోయింది. దోవను బంధిస్తూ కట్టిన గోడతాలూకు ప్రయోజనం, అన్నాకాళీ కూడా గ్రహించి ఉంటుంది మరి!

మరో నెలరోజులు గడిచాయి. ఒక నాడు భువనేశ్వరి ఏవో మాటల సందర్భంలో, 'నాయనా! ఈ మధ్య నువ్వెప్పుడన్నా లలితను చూశావుట్రా?' అన్నది.

'లేదమ్మా! ఎందుకూ?!' అన్నాడు శేఖరుడు.

'ఇందు మించు, రెండు మాసాలకు గాను, మొన్న మిద్దెమీదికివస్తే పిలిచాను శేఖర్! మనిషి బాగా మారిపోయింది. ఏదో జబ్బుపడిన దానిలాగా, ముఖమంతా పీక్కుపోయి ఉన్నది. కాని ఆ ముఖంలో ఎంత గంభీరత! ఇప్పుడా పిల్లను చూసినవారెవ్వరూ, దానికి పద్నాలుగేళ్ళంటే నమ్మరు.' అన్నది భువనేశ్వరి కళ్ళు తుడుచుకొంటూ. 'ఇప్పుడు లలిత మాసిపోయిన, పాత చీరెలు కట్టుకొంటోంది. 'నీకు చీరెలు లేవా తల్లీ?' అన్నాను. ఉన్నాయనే అన్నది గానీ, నే నామాట నమ్మలేను. వాళ్ళ మామ తెచ్చిన గుడ్డలను ఏనాడూ అది కట్టుకోలేదు శేఖర్ బాబూ! దానికి అవసరమైన గుడ్డలన్నీ నేనే ఇస్తుండేదాన్ని. ఈ రెండు నెలల నుండీ, ఒక్క గుడ్డముక్కన్నా నేను లలిత కివ్వలేదు' ఆపైన మాట్లాడలేకపోయింది భువనేశ్వరి. శేఖరుడేమీ మాట్లాడకుండా, మరోవైపుకేసి చూస్తున్నాడు. భువనేశ్వరి కాస్సేపాగి తిరిగి ప్రారంభించింది:

'లలిత నన్ను తప్ప, ఎప్పుడూ, ఎవ్వరినీ, ఏ వక్కటీ అడిగేది కాదు. వేళ గాని వేళ ఆకలివేసినా, ఆ యింట్లో వారినెవ్వరినీ అడగదు. నన్ను కూడా అడగదు. ఊరికే నా కొంగు పుచ్చుకొని తిరుగుతుండేది. దాని ముఖం చూసీ చూడడంతోనే, దానికేమి కావాలో నేను తెలుసుకొనేదాన్ని. ఈ సంగతే, నాకు మాటి మాటికీ జ్ఞాపకమొస్తుంటుంది శేఖర్! ఇప్పుడూ, ఆ యింట్లో, లలిత, అలాగే ముఖం వేళ్ళాడేసుకొని తిరుగుతూ ఉంటుంది. కాని దానికేమి కావాలో, ఆ యింటివారు తెలుసుకోలేరు. లలిత కూడా నోరు తెరిచి, నాకిది కావాలని అడగదు. నన్ను ఊరికే 'అమ్మా' అని పిలవడమే గాదు; నిజంగా కన్నతల్లిని ప్రేమించినట్లే ప్రేమించింది.'

శేఖరుడు సాహసించి తల్లిని చూడలేక, ఆ దిక్కుకేసే చూస్తూ 'సరేనమ్మా! ఇప్పుడైనా లలితను పిలిచి, దానికేమి కావాలో ఎందుకడగకూడదూ?' అన్నాడు.

'అడుగుతాను కావాలన్నది ఇస్తాను. కానీ నాయనా, ఇప్పుడు లలిత అడగదు. నేనిచ్చినా తీసుకోదు. వచ్చిపోయే మార్గాన్నిగూడా మీ నాన్నగారు మూయించి వేశారయ్యా. నే నే ముఖంతో దానికిచ్చేది శేఖర్? ఏవో కష్టాల్లోఉండి, మరిదిగారు కానిపనేచేశాడనుకో? మన వారికే అది జరిగినట్లు భావించి, ఏ ప్రాయశ్చిత్తం లాంటిదో జరిపించి, కమ్మివేస్తే తీరిపోదా? అదీ లేదు; ఇదీ లేదని, ఒక్క మాటే, తాంగున గోడకట్టి పారేసె. అసలీ గొడవలన్నీ జరగడానికి మీ నాన్నగారే ముఖ్య కారణం శేఖర్! జలగలాగా పట్టి పీడించడం వల్లనే, ఆబాధపడలేక, బ్రహ్మమతంలో కల్లి కలిశాడు గురుచరణుడు. ఒకరకంగా చూస్తే మరిది మంచిపనే చేశాడేమో ననిపిస్తుంది. మనందరి కన్నా ఆ గిరీంద్రుడే మరిదికి ఎక్కువ సహాయం చేశాడు. అతనికిచ్చి ముడి పెడితే, లలిత లక్షణంగా సుఖపడగలదని నేను ఘంటాపథంగా చెబుతాను. వచ్చేనెలలో వారిద్దరికీ పెళ్ళవుతుందట.'

'అమ్మో! వచ్చే మాసంలో నేనా?' అన్నాడు గిరుక్కున ఇటు తిరిగి శేఖరుడు.

'అలా అనే, నేనూ విన్నాను!'

శేఖరుడింకేమీ అడగలేదు. భువనేశ్వరి కొంచెం సేపుండి ఇలా అన్నది: 'మామయ్య వంట్లో బాగుండటం లేదని మొన్న లలిత చెప్పింది. ఎలా ఉంటుంది నాయనా బాగా? మనస్సుకు శాంతి అనేదే లేదాయె! పైగా ఇంట్లో ప్రతినిత్యం ఏడుపులూ, మొత్తుకోళ్లూనూ. ఒక్క నిమిషమన్నా, ఇంట్లో శాంతిలేకపోతే, వంట్లో ఎలా బావుంటుంది శేఖర్?'

ఈ మాటలని తల్లి వెళ్ళిపోగానే, శేఖరుడు ప్రక్కమీద పడుకొని లలితను గురించి ఆలోచించ సాగాడు.

వీరి ఇంటి ముందరి వీధి చాలా చిన్నది. రెండు బళ్లు స్వేచ్ఛగా తప్పుకొందుకు గూడా వీలు లేనంత ఇరుకుగా ఉంటుందా గల్లీ. ఒక నాడు శేఖరుడు ఆఫీసునుండి వస్తున్నాడు. గురుచరణుని ఇంటి ముందు ఇలాంటి ఆటంకమే సంభవించింది. శేఖరుడు దిగి విచారించాడు. ఆ బండిలో డాక్టరు గారొచ్చారని సమాధానం వచ్చింది.

గురుచరణుడు అస్వస్థుడుగా ఉన్నాడని కొన్ని రోజుల క్రిందట తల్లి చెప్పగా శేఖరుడు విన్నాడు. చప్పున ఆ విషయ మిప్పుడు జ్ఞప్తి

కొచ్చింది. అతను సరాసరి ఇంటికి రాకుండా గురుచరణుని ఇంటికొచ్చాడు. తల్లి చెప్పినమాట నిజమే! గురుచరణుడు నిర్జీవంగా, మంచాన్ని అంటి పెట్టుకొని ఉన్నాడు. ఒక పక్కగా లలితా గిరీంద్రులు విచారంతో కూర్చుని ఉన్నారు. డాక్టరు ఎదురుగా ఉన్న కుర్చీలో కూచుని రోగిని పరీక్షిస్తున్నాడు. శేఖరుడు రావడాన్ని గురుచరణుడు చూసి, ప్రయత్నపూర్వకంగా, అస్ఫుటంగా 'కూర్చో'మని మాత్ర మన్నాడు. లలిత తల మీదికి మరింత ముసుగు లాగుకొని, ముఖం ప్రక్కకు తిప్పుకొన్నది.

డాక్టరు ఈ పేటలోని వాడే గావడంవల్ల, శేఖరుడు అతన్ని బాగా ఎరుగును. రోగిని పరీక్షించి, మందురాసి, శేఖరునితో సహా బైటకొచ్చి కూర్చున్నాడు డాక్టరు. గిరీంద్రుడు వెనకనే వచ్చి, డాక్టరు గారికి ఫీజు చెల్లించాడు.

'అదృష్టవశాత్తూ రోగమింకా అసాధ్యస్థితిలోకి రాలేదు! ఈ సమయంలో గాలిమార్పు ఈ రోగికి చాలా అవసరం!' అన్నాడు డాక్టరు పోబోతూ. డాక్టరు వెళ్ళగానే, శేఖరుడు, గిరీంద్రుడు తిరిగి లోపలి కొచ్చారు.

లలిత చేసైగ చేసి గిరీంద్రుణ్ని చాటుకుపిలిచి, అతనితో మంతనాలాడ నారంభించింది. శేఖరుడు డాక్టరు వదిలిన కుర్చీలో కూచుని, గురుచరణుని కేసి తదేకంగా చూస్తున్నాడు. గురుచరణుడు గోడవేపు తిరిగి పడుకొన్నాడు. శేఖరుడు తిరిగి వచ్చాడని అతనికి తెలియదు.

శేఖరుడలానే కొద్దిసేపు కూచుని, పోవడానికి లేచాడు. ఇంకా లలితా గిరీనులు గుసగుస లాడుతూనే ఉన్నారు. అతన్ని ఎవ్వరూ కూర్చోమనలేదు; కనీసం మళ్ళా వస్తారా అనైనా అడగలేదు. అసలు అతన్ని పలకరించిన వాళ్ళు కూడా లేరు.

ఒకానొక కఠినతమ బంధంనుంచి, ఇవ్వాళ తను విముక్తుడయినట్లు శేఖరుడు భావించాడు. ఇక తను స్వేచ్ఛగా తిరగవచ్చు; హాయిగా గాలి పీల్చుకోవచ్చు. ఏ పరిస్థితులలోనూ, లలిత ఇక తనను వెంబడించదు.

శేఖరుడింటికి వచ్చి దుస్తులు మార్చుకొంటున్నప్పుడు, ఈవిషయాలు అక్కడ చూచిన విషయాలే తలపుకు వచ్చాయి. ఈ నాడు గిరీంద్రుడే

వారికి పరమాప్తుడున్న సంగతి తను స్వయంగా చూశాడు. అతనే వారందరికీ ఆధారభూతుడు. భవిష్యత్తులో, లలితకు ఆశ్రయదాత గూడా గిరీంద్రుడే! కానీ, తను మాత్రం వారికేమీ కాడు. వారికీ తనకూ సంబంధమే లేదు. ఇలాంటి ఆపత్సమయంలో గూడా లలిత తనను పలకరించ లేదు. పైగా తనను చూడంగానే, ముసుగు కప్పుకొని, ముఖమటు కేసి తిప్పుకొన్నది. తను పరాయివాడా? అపరిచితుడా? తను అక్కడనే ఉన్నాడు. గిరీంద్రుణ్ణి చాటుకు పిలిచి గుసగుసలాడింది. ఒకనాడు-ఇతగాడి వెంట వెళ్ళి, నాటకం చూడడానికి గూడా తను అనుమతించ లేదు. నాటికీ నేటికీ ఎంత భేదం?

శేఖరుడు తన మనస్సుకు సంతృప్తి పరుచుకోవాలని-ఒకవేళ; తమ మధ్య గల రహస్య బాంధవ్యం జ్ఞప్తికొచ్చి, అలా ప్రవర్తించి ఉండవచ్చని సరిపెట్టుకో జూచాడు. కానీ అది సంభవంకాదే! అదే గనుక యాథార్థమయినట్లయితే, ఇంత కాండ జరిగినప్పుడు, ఇన్ని రోజులయినప్పటికీ, ఈ విషయాన్ని గురించి, తెలుసుకోవాలని ప్రయత్నించనన్నా ప్రయత్నించదా?

గది బైట తల్లి కంఠస్వరం వినిపించింది. 'ఏం నాయనా! ఇంకా కాళ్ళు చేతులు కడుక్కో లేదేమిరా? ప్రొద్దుకూకింది!' అన్నది భువనేశ్వరి.

శేఖరుడు ఉలిక్కిపడి లేచాడు. తల్లికి ముఖం కనబడనీకుండా ప్రక్కకు పెట్టుకొని, గబగబా క్రిందికి దిగి పోయాడు.

ఇన్నాళ్ళ నుండీ శేఖరుడు అనేక విధాలుగా ఆలోచిస్తున్నాడు. ఒక్కసారైనా 'తప్పెవరిది?' అన్న విషయాన్ని గురించి అతను ఆలోచించ లేదు. ఆశాపూరితమైన ఒక్క మాట అతను లలితకు చెప్పలేదు. కనీసం, ఆ మాట అడిగే అవకాశమైనా లలితకు కలిగించలేదు. ఈ రహస్యం వెల్లడవుతుందేమోననీ, అదే జరిగే పక్షాన, దానినెలా నెదుర్కోవలసి ఉంటుందనీ మాత్రమే అతను ఆలోచిస్తున్నాడు. అపరాధమంతా లలితకే అంటగట్టి విచారణ సాగిస్తున్నాడు. కోపంతోను, అవమానం తోను, ఈర్ష్యాద్వేషాలతోనూ అతని మనస్సు సంక్షుభిత పడసాగింది. అతను నిలువునా దహించుకు పోతున్నాడు. బహుశః ప్రపంచంలోని పురుషులందరూ,

ఇలాగే ఏకపక్ష విచారణలు చేసి, మనఃక్షోభానికి పాల్పడి, తరువాత తామే దహించుకుపోతారేమో చెప్పలేము.

‘శేఖరు డిలా తపిస్తూ ఒకవారం రోజులు గడిపాడు. ఇవాళ సాయంత్రం గూడా నిశ్శబ్దం ఆవరించి ఉన్న ఆగదిలో, అలాగే తపించి పోతూ కూర్చున్నాడు శేఖరుడు. అకస్మాత్తుగా వాకిలిముంగు పాదాల ధ్వని విని తల ఎత్తిచూశాడు. అతని హృదయం గంతు వేసినట్లయింది. అన్నాకాళీ చేయి పట్టుకొని, లలిత గదిలో కొచ్చి, క్రింద తివాసీమీద కూర్చున్నది.

‘శేఖర్ బాబూ! మీకు నమస్కరించాలని, మేమిద్దరమూ వచ్చాము. రేపెల్లి పోతున్నాము’ అన్నది అన్నాకాళీ.

శేఖరు డేమీ మాట్లాడలేక, అలానే చూస్తున్నాడు.

‘శేఖర్‌దా! మీపాద సన్నిధిన మే మనేక తప్పులుచేసి ఉండ వచ్చు. వాటి నన్నింటినీ మరిచిపోండి.’ అన్నది అన్నాకాళీ.

ఇందులోని ఏ ఒక్కమాటా అన్నాకాళీ, స్వంతం కాదనీ, ఈ పిల్ల ఇంటి దగ్గర బట్టీపెట్టిన వాటి నే ఇక్కడ ఒప్ప చెబుతున్నదనీ శేఖరుడు గ్రహించాడు.

‘రేపు మీ రెక్కడి కెడుతున్నారు?’ అన్నాడు శేఖర్.

‘ముంగేరు. నాన్నను తీసుకొని మేమందరం గిరీన్ బాబు గారింటికి పోతున్నాము. నాన్నకు వ్యాధి నయమయినా, మేమిక్కడికి తిరిగి రాము. ఇక్కడి నీరు నాన్నకు సరిపడదని డాక్టరుగారు చెప్పారు.’

‘ఇప్పుడు వారి కెలా ఉన్నది?’ అనడిగాడు శేఖర్.

‘కొంచెం నయమే!’ అన్నది కాళీ, చెంగుచాటు నించి రెండు చీరెలు పైకి తీసి చూపిస్తూ. ‘పెద్దమ్మ వీటిని మాకు కొనిపెట్టింది.’

ఇంతసేపూ లలిత మాట్లాడ లేదు. ఇప్పుడు మెల్లగా లేచి, తాళా చేతులు బల్లమీదపెట్టి, ‘ఇంతవరకూ ఇవి నాదగ్గరే ఉండిపోయాయి!’ అన్నది చిరునవ్వు నవ్వి. ‘కానీ ఇప్పుడా బీరువాలో డబ్బు లేదు, అంతా ఖర్చయిపోయింది.’

శేఖరుడు మాట్లాడ లేదు.

'వదినా! పోదాం పద. ప్రొద్దు పోతోంది!' అన్నది కాళీ శేఖరుడు కలుగ చేసుకొని, 'కాళీ! క్రింది కెళ్ళి రెండు తమలపాకులు పట్టుకురా అమ్మా!' అన్నాడు.

కాళీ వెళ్ళబోయింది. లలిత ఆ పిల్ల చేయి పట్టుకొని ఆపి, 'నేను వెళ్ళి తీసుకొస్తాను కాళీ! నువ్విక్కడే ఉండు' అని క్రింది కెళ్ళి ఆకులు తీసుకొచ్చి కాళి కిచ్చింది. కాళీ, శేఖరుని కిచ్చింది. అతను ఆకులను చేత బట్టుకొని ఆశ్చర్య పోయాడు.

'పోతున్నాము శేఖర్ దా!' అని అన్నా కాళీ అతని పాదాల వద్ద కూచుని నమస్కరించింది. లలిత దూరంగా ఉండే ప్రణమిల్లింది. తరువాత ఇద్దరూ కలిసి వెళ్ళారు.

శేఖరుడు మతిపోయిన వాడిలాగా, వెలవెల బోతున్న ముఖంతో, స్తబ్దుడై కూచున్నాడు. లలిత వచ్చింది. చెప్పవలసింది చెప్పింది. కానీ తానేమీ మాట్లాడ లేకపోయాడు. ఉన్న కాలాన్ని వమ్ము చేశాడు. లలిత ఉద్దేశపూర్వకంగానే, కాళీని వెంటబెట్టుకొచ్చింది. పాత సంగతు లేవీ, తిరిగ త్రవ్వబడకుండా ఉండేందుకే, లలిత ఈ పనిచేసి ఉంటుంది.

అతని శరీరమంతా జ్వలించి పోతున్నది. తల తిరుగుతున్నది. స్థిరంగా కూచోలేక పోయాడు. లేచి గాలిలో ఈదుతున్నట్టు పక్కను సమీపించి, కళ్లు మూసుకొని పడుకొన్నాడు.

# 11

గురుచరణుని అస్వస్థశరీరం, ముంగేరు జలవాయువులకు కూడా కోలుకోలేదు. ఓ సంవత్సరంపాటు జీవచ్ఛవంలాగా గడిపి, దాటి పోయాడు. గురుచరణుని బ్రదికించాలని తుదిక్షణం వరకూ తీవ్రంగా ప్రయత్నించాడు గిరీంద్రుడు. అతని ప్రయత్నాలు ఫలించలేదు. నిజంగా వీరిని గిరీంద్రుడు ఎంతగానో ప్రేమించాడు.

గురుచరణుడు చనిపోయే ముందు, గిరీంద్రుని చేయి పట్టుకొని 'గిరీన్ బాబూ! మన పరిచయాన్ని పరిచయంగా మాత్రమే ఉంచకండి!

దీనిని బంధుత్వంగా పరివర్తింప చేయండి. ఆ భాగ్యాన్ని నేనీలోకంలో చూడలేకపోవడం, నాదురదృష్టం! పరలోకంలోనైనా నాకా అదృష్టాన్ని కలిగించండి' అని పాటికి పదిసార్లు ప్రార్థించాడు.

కలకత్తాలోని గురుచరణుని ఇల్లు ఇప్పుడు అద్దెకు ఇవ్వబడి ఉన్నది. అందులో అద్దెకున్న వారి ద్వారా భువనేశ్వరి ముంగేరు విషయాలు తెలుసుకొంటుండేది. గురుచరణుని మరణవార్త కూడా ఆమె విన్నది.

ఇది జరిగిన కొద్ది రోజులకే నవీనుడు కూడా మరణించాడు. భువనేశ్వరి పిచ్చిదానిలా అయింది. సంసార భారాన్ని పెద్దకోడలికి అప్పగించి ఆమె కాశీ వెళ్లి పోయింది. అన్నీ సిద్ధంచేసి ఉంచితే, వచ్చేసంవత్సరము తాను వచ్చి శేఖర్ బాబుకు వివాహం చేస్తానని చెప్పింది.

సంబంధమేమో నవీనరాయ్ గారే స్థిర పరిచారు. ఇప్పటి కెప్పుడో ఆ పెళ్లి అయిపోవలసింది. ఆయనగారు చనిపోవడం మూలంగా, ఒక సంవత్సరం పాటు ఆగిపోవలసి వచ్చింది. పిల్ల తరఫువాళ్లు ఇక ఆగరు. అందుకనే వారు నిన్న వచ్చి ముహూర్తం పెట్టుకొని వెళ్లారు. పెళ్ళి ఈ నెలలోనే జరుగుతుంది. తల్లిని తీసుకురావాలని శేఖరుడు ప్రయాణమవుతున్నాడు. బీరువాలో నించి గుడ్డలు తీసి సర్దుతుండగా లలిత జ్ఞాపకమొచ్చింది. లలిత ఇక్కడున్నప్పుడు, ఇలాంటిపనులన్నీ ఆమె చేస్తుండేది.

గురుచరణుని కుటుంబం ముంగేరు వెళ్లి ఇప్పటికి మూడేళ్లు కావస్తున్నది. ఈమధ్య వారి స్థితిగతు లేమిటో శేఖరునికి తెలియవు. తెలుసుకోవాలని కూడా అతనికి లేదు. లలితమీద అనురాగానికి బదులు ద్వేషం గూడుకట్టుకొన్నది. కానీ ఈనాడు ఆమె ఎలా ఉన్నదో తెలుసుకోవాలన్న కోరిక కలిగింది. ఆమె క్షేమంగానే ఉండి ఉంటుందనుకొన్నాడు. ఎందుకంటే గిరీన్ బాబు శ్రీమంతుడు. అయినా, వారిద్దరికీ వివాహ మెప్పుడయిందో, లలిత అతనితో ఎలా కాపురం చేస్తున్నదో తెలుసుకోవాలనుకొన్నాడు.

ఆ యింట్లో అద్దెకున్నవారు, రెండునెలల క్రిందటే ఖాళీచేసి వెళ్లిపొయ్యారు. చారుబాల తండ్రిని అడుగుదా మనుకొన్నాడు. వారికి గిరీంద్రుని క్షేమ సమాచారాలు తప్పకుండా తెలుస్తుంటాయి... శేఖరుడు ఓక్షణకాలం సర్దుడు ఆపి, కిటికీ చువ్వలు పట్టుకొని శూన్యంలోకి చూడ

సాగాడు. దాసీమనిషి వచ్చి 'బాబుగారూ! ఈ యింటి అమ్మగారు, మిమ్మొకసారి పిలుచుకు రమ్మన్నారు' అన్నది.

'ఏఇంటి అమ్మగారే!' అన్నాడు శేఖరుడు ఆశ్చర్యంగా.

దాసీది గురుచరణుని ఇల్లు చూపి 'వారందరూ రాత్రేవచ్చారండీ!' అన్నది.

'పద. వస్తున్నాను.'

శేఖరుడు వెంటనే మెట్లు దిగి వెళ్లాడు.

అప్పటికి చాలావేళ మిగిలింది. శేఖరుడా ఇంట్లోకి అడుగుపెట్టగానే, ఆక్రందన ధ్వనులు చెలరేగాయి. విధవ వేషంలో ఉన్న గురుచరణుని భార్య దగ్గరకెళ్లి క్రింద కూచుని, కళ్ళు తుడుచుకొన్నాడు శేఖరుడు.

ప్రొద్దు కూకంగానే లలిత వచ్చి దీపం వెలిగించింది. శేఖరునికి దూరంగా నిలబడి నమస్కరించి, ఒక్షణం ఆగి వెళ్లిపోయింది. పదిహేడు సంవత్సరాల ప్రాయం గల ఆ పరస్త్రీని కన్నెత్తి చూడలేక పోయాడు శేఖరుడు. కనీసం మాట్లాడనన్నా మాట్లాలేకపోయాడు. అయినా అతను లలిత చిక్కిపోయిందని గ్రహించాడు.

ఏడుపులు, ఓదార్పులూ అయ్యాయి. తరువాత గురుచరణుని భార్య చెప్పిన దాని సారాంశమిది:

ఈ యిల్లు అమ్మేసి, ముంగేరులో అల్లుడు దగ్గరే ఉందామని ఆమె అనుకొంటున్నది. నవీనుడు ఈ ఇల్లు కొనాలని చాలాకాలం నుండి అనుకొంటున్నాడు. ఒకరు అడిగిన ధరకు వీరికే ఇస్తుంది. ఈ ఇల్లు వీరే కొనడం జరిగితే, ఎప్పుడన్నా ఈ ప్రాంతాల కొచ్చినా, ఒకటి రెండు రోజులు స్వంత ఇంట్లో ఉన్నట్లే ఉండవచ్చు. తల్లితో సంప్రదించి, చేయువలసిన సహాయమంతా చేస్తానన్నాడు శేఖరుడు.

'అక్కయ్యా, ఇంతట్లో రావా శేఖర్‌దా?' అన్నదామె.

ఈ రాత్రే ఆమెను తీసుకురావడానికి తను ప్రయాణమవుతున్నట్టు చెప్పాడు శేఖరుడు. ఆ తరువాత, శుభాశుభ విషయాలన్నో ప్రసంగంలోకి వచ్చాయి.

శేఖరుడు ఆమె దగ్గర సెలవు తీసుకొనే సరికి, వెన్నెల బాగా కాస్తోంది. ఆ సమయంలోనే గిరీంద్రుడు డాబా మీది నుండి దిగి, బహుశః నారక్కగారింటికేమో-వెళ్లాడు.

'శేఖర్ బాబూ!' అన్నది గురుచరణుని భార్య. 'మా అల్లుడు గారితో నీకు పరిచయం లేదా? ఇలాంటి వారు ఈ ప్రపంచంలో చాలా తక్కువ మంది ఉంటారు నాయనా!'

అతనికీ తనకూ పరిచయం ఉన్నదనీ, అందులో సంగ్రహించ వలసిందేమీ లేదనీ, చెప్పి, తొందరగా మెల్లాలోకి వస్తూ ఆగిపోయాడు.

చీకట్లో, తలుపు చాటున నిలబడి ఉన్న లలిత, 'అమ్మను తీసుకు రావడానికి ఇవ్వాళే పోతున్నారా?' అన్నది.

'అవును.'

'అమ్మ చాలా దిగులు పడిందండి!'

'ఆం. దాదాపు పిచ్చిదానిలా అయి పోయింది!'

'మీ ఆరోగ్య మెలా ఉన్నది?'

'బాగానే ఉన్నది.' అంటూ శేఖరుడు గబగబా బయట పడ్డాడు. రోడ్డు మీదికి వచ్చి, సిగ్గుతోను, అసహ్యంతోనూ కంపించి పోయాడు శేఖరుడు. లలిత తన ప్రక్కనే నిలబడిఉండటంతో, తన శరీరం కలుషితమై ఉంటుందని భావించాడు. ఇంటికి వచ్చి ఎలానో పెట్టె సర్దేశాడు. బండి కింకా చాలా టైముంది. ప్రక్కమీద పడుకొన్నాడు. అసహ్యమనే దావానలాన్ని ప్రజ్వలింప జేసుకొన్నాడు. అందులో లలిత విషాక్త స్మృతిని సమూలంగా భస్మం చేయాలని సంకల్పించుకొన్నాడు. ఆమెను, అనరాని మాటలన్నీ అన్నాడు. చివరకు 'కులట' పదప్రయోగం చేయుడానికి గూడా అతను సంకోచించ లేదు.

ఇంతకు ముందు, గురుచరణుని భార్య, ప్రసంగ వశాత్తూ అన్నది: 'ఇది ఆనందంతో జరిగిన పెళ్ళి కాదు. చివరి ఘడియ వరకూ ఇలా అవుతుందని ఎవ్వరమూ అనుకోలేదు. మీ అందరికీ కబురు చేయమని కూడా లలిత అన్నది. కానీ...'

లలిత యొక్క ఈ స్పర్థను చూసి, శేఖరుని హృదయాగ్ని జాజ్వల్యంగా ప్రజ్వరిల్లింది.

## 12

ఇంకా పది పన్నెండు రోజులలో పెళ్ళి లగ్నం ఉన్నదనగా శేఖరుడు తల్లిని తీసుకొచ్చాడు.

రెండు మూడు రోజుల తదనంతరం, ఏదో పని బడి, శేఖరుడు తల్లి దగ్గరి కెళ్ళాడు. లలిత, తల్లి ప్రక్కనే తల వంచుకొని కూచుని, ఏదో పని చేస్తున్నది.

'ఎందు కొచ్చావు నాయనా!' అన్నది భువనేశ్వరి.

ఎందు కొచ్చిందీ శేఖరుడు మరిచి పోయాడు 'కాదు కాదు. ఇప్పుడు కాదు' అంటూ చక చకా వెళ్ళి పోయాడు. అతనికి లలిత ముఖం కనిపించ లేదు. చేతులు మాత్రమే కనిపించాయి. చేతులకు గాజులు తప్ప మరేమీ లేవు. శేఖరుడు క్రూరంగా నవ్వాడు. 'ఇదో రకం వేషం' అనుకున్నాడు. గిరీంద్రుడు బాగా ఉన్నవాడని అతనికి తెలుసు. అయినా అతని భార్య నిరాభరణగానే ఉన్నది. దీనికి గల కారణమేమిటో అతనికి బోధ పడ లేదు.

ఆనాటి సాయంకాలం, ఏదో పని మీద శేఖరుడు క్రిందికి దిగి వస్తున్నాడు. లలిత మెట్లెక్కి పైకి వస్తున్నది. అతన్ని చూసి, ప్రక్కకు ఒత్తిగిల్లింది. అతను దగ్గరకు రాగానే, సంకోచిస్తూ 'మీతో ఒక మాట చెప్పాలి' అన్నది లలిత.

'నాతోనా?' అన్నాడు శేఖరుడు ఆశ్చర్యంగా.

'అవును. మీతోనే!' అన్నది లలిత మెల్లిగా.

'నాతో నువ్వు చెప్పవలసిన మాట ఏముంది లలితా?' అంటూ శేఖరుడు గబ గబా మెట్లు దిగి పోయాడు.

లలిత కొన్ని క్షణాలు స్తబ్ధంగా ఉండి పోయింది. చివరకు నిట్టూర్పు విడిచి, మెల్లిగా వెళ్ళి పోయింది.

ఆ మరునాడు శేఖరుడు వరండాలో కూచుని, పేపరు చదువు కొం టున్నాడు. గిరీంద్రుడు అక్కడికి వచ్చాడు. అతని రాక శేఖరుని కెంతో ఆశ్చర్యం కలిగించింది. గిరీన్ బాబు నమస్కరించాడు. కుర్చీని దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు. శేఖరుడు ప్రతి నమస్కారం చేసి, పత్రికను అవ తల బెట్టి జిజ్ఞాసగా, గిరీంద్రుని ముఖంలోకి చూశాడు. వారిద్దరూ ఒకరి నొకరు ఎరుగుదురు. కానీ ఇంత వరకూ మాట్లాడుకో లేదు.

గిరీంద్రుడు ఉపోద్ఘాత మేమీ లేకుండా సరాసరి అసలు విషయా న్నెత్తు కొన్నాడు.

'ఒక ముఖ్యమైన పని ఉండి మీ వద్ద కొచ్చాను. మా అత్తగారి ఉద్దేశం మీరు వినే ఉన్నారు. ఇల్లు మీకే అమ్మాలని ఆమెగారనుకొం టున్నారు. ఆ సంగతే నాతోనూ చెప్పారు. సాధ్యమైనంత త్వరలో మీరు ఏదో ఒకటి తేల్చుకోండి. ఈ నెలలోనే మేము ముంగేరు వెళ్ళ దామను కొంటున్నాము.'

గిరీంద్రుని ముఖ దర్శనంతో, శేఖరుని హృదయంలో చిన్నగుబాను రేగింది. ఈ రకమైన సంభాషణ అతనికెంత మాత్రం నచ్చలేదు.

'అది మంచి మాటే! నాన్నగారు పోయినప్పణ్ణుంచీ, అన్ని విష యాలూ అన్నగారే చూసుకొంటున్నారు. మీరీ సంగతి వారికి చెబితే బావుంటుంది!'

'ఆ సంగతి నాకు తెలుసుననుకోండి!' అన్నాడు గిరీంద్రుడు చిరు నవ్వునవ్వుతూ. 'కానీ, వారికైనా మీరు చెప్పట మేమంచిదనుకొంటున్నాను.'

'మీరు చెప్పినా బావుంటుంది. ప్రస్తుతం వారి సంరక్షకులు మీరే కదా!' అన్నాడు కసిగా.

'నే నే చెప్పి తీరవలసిన అవసరం ఉంటే, అలాగే చెబుతాను. అయితే, మీరు తలుచు కొంటే, చాలా సులభంగా అవుతుందని, నిన్న చెల్లి అన్నది!'

బాలీసుకు జేరగిల బడి మాట్లాడుతున్న శేఖరుడు ఉలిక్కిపడి లేచి కూచున్నాడు.

'ఎవరూ మీతో చెప్పింది?'

'చెల్లి—లలిత చెప్పింది.'

శేఖరుడు విస్మయంతో హతబుద్ధుడైనాడు. ఆ తరువాత గిరీంద్రుడేమి చెప్పిందీ అతనికి వినిపించ లేదు. కొంచెం సేపు విస్తుపోయి గిరీంద్రుని కేసిచూస్తూ 'క్షమించండి గిరీన్ బాబూ! మీరు—లలితను వివాహం చేసుకో లేదా?' అన్నాడు శేఖరుడు.

గిరీనుడు నాలుక కరుచు కొన్నాడు.

'చిత్తం. లేదండీ! వారి నందరినీ మీరు ఎరుగుదురు గదా! నేను కాళీని చేసుకొన్నాను.'

'కానీ, మొదట్లో అలాంటి మాటలు జరగ లేదే!'

'జరగ లేదు.' అన్నాడు గిరీనుడు స్థిరంగా. 'మీరన్న మాట నిజమే! గురుచరణ బాబు గారికి, ఎక్కడా మరో సంబంధం చేసుకోనని నేను మాట ఇచ్చాను. ఆయన చనిపోయిన తరువాత, లలిత నాకన్ని సంగతులూ చెప్పింది. మూడో కంటికి వారికి తెలియక పోయినా, ఆమె తనకు వివాహం జరిగిందనీ, భర్తగారు జీవించే ఉన్నారనీ చెప్పింది. ఇతరులెవ్వరూ ఈ మాటలు విశ్వసించ లేదు. కానీ నేను విశ్వసించాను. ఆమె అసత్య మాడదని నా నమ్మకం! అదీగాక—స్త్రీలు ఒకసారి కంటె ఎక్కువసార్లు వివాహ మాడరు...అయ్యో! అదేమిటి శేఖర్ బాబూ! ఎందు కలా...?'

శేఖరుని కన్నులు బాష్పపూరితా లయినాయి. అవి కనుకొలనులు దాటి, ధారలుగా స్రవించ సాగాయి. ఈసంగతి తెలుసుకొనే స్థితిలో శేఖరుడు లేడు. ఒక పురుషుని ఎదుట, మరో పురుషుని దౌర్బల్యం, ఇలా వ్యక్తం గావడం లజ్జాకరమని గూడా అతనికి తోచ లేదు.

ఇంత కాలంగా గిరీంద్రుని మనస్సులో ఉన్న అనుమానం ఇప్పుడు తీరిపోయింది. అతను లలిత భర్తను గుర్తించాడు. శేఖరుడు కళ్ళుతుడుచు కొన్నాడు. గద్గద స్వరంతో 'గిరీన్ బాబూ! మీరు లలిత నెప్పుడూ ప్రేమించ లేదా?' అన్నాడు.

గిరీన్ బాబు వదనం మీద ప్రచ్ఛన్న వేదనచ్ఛాయ ఓక్షణకాలం మసిలి మాయమయింది. అతను చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు:

'ఈ ప్రశ్నకు ఇప్పుడు జవాబివ్వడం కేవలం అనవసరం! ఎంతటి ప్రేమయినా-తెలిసి కూడా, మరొకరిభార్యను ఎవ్వరూ వివాహమాడరు. సరే పోనివ్వండి. పూజనీయులను నేను విమర్శించను' అన్నాడు గిరీంద్రుడు మరోసారి నవ్వి. 'మరి నేను పోతున్నాను. సెలవు. మళ్ళీ తమ దర్శనం చేసుకొంటాను!' అని నమస్కరించి వెళ్లాడు.

ప్రప్రథమము నుండీ గిరీన్ బాబును, శేఖరుడు ద్వేషిస్తున్నాడు. ఈ ద్వేషభావం ఇటీవల అసహ్యంగా కూడా పరిణమించింది. కాని, ఈనాడు అతను వెళ్ళగానే, శిరస్సువంచి, ఆ అపరిచిత బ్రాహ్మణయువకునికి నమస్కరించాడు శేఖరుడు. మరో మానవునికి తెలియకుండా, మానవుడెంతటి స్వార్థత్యాగాన్ని చేయగలడో, ఎటువంటి కఠినవాగ్బాణాల నైనా, చిరునవ్వుతో, ఎలా భరించగలడో, శేఖరుడు తొలిసారిగా తెలుసుకొన్నాడు.

మధ్యాహ్నం భువనేశ్వరి తనగదిలో కూచుని, లలిత సాయంతో కొత్తగుడ్డలను బొత్తిపెడుతున్నది. శేఖరుడు వచ్చి మంచంమీద కూచున్నాడు. ఇప్పుడతను లలితను చూసి గాభరా పడలేదు, పరాగ్గత్తనూ లేదు.

'ఎందుకొచ్చావ్ నాయనా?' అన్నది తల్లి.

శేఖరుడు జవాబివ్వకుండా కొంచెం సేపు అలానే కూచున్నాడు, గుడ్డ బొత్తికలవంక చూస్తూ. ఓక్షణమయాక — 'ఏంచేస్తు న్నావమ్మా?' అన్నాడు.

'కొత్త గుడ్డలు ఎవరెవరికి పెట్టాలో లెక్క చూస్తున్నాను.' అన్నది భువనేశ్వరి లలిత వంక తిరిగి 'ఇవి చాలవు. ఇంకా కొనాలను కొంటాను. ఏంతల్లీ?'

లలిత ఔనన్నట్లు తల ఆడించింది.

'అమ్మా! ఒక వేళ నేను పెళ్లి చేసుకోక పోతేనో!' అన్నాడు శేఖరుడు నవ్వుతూ.

'ఇది వరకు నువ్వుచేసిన పనుల కంటే, ఇదేమంత గొప్పదిరా!' అన్నది తల్లిగూడా నవ్వి.

'ఇప్పుడు-నిజంగా అలాంటి పరిస్థితులే వచ్చాయమ్మా!'

'అలాంటి, అపభ్రంశపు మాటలు, అనబోకు నాయనా! తప్పు' అన్నది తల్లి గంభీరంగా.

'ఇన్నాళ్ళ నుంచీ అనలేదు. కానీ ఇక మాట్లాడకుండా ఉండడానికి వీలులేదు. ఇంకా మౌనంగా ఉంటే, మహాపాపం చుట్టుకొంటుంది.'

భువనేశ్వరికి అర్థం కాలేదు.

'అమ్మా! ఇది వరకు నీబిడ్డ తప్పుల నెన్నింటినో నువ్వు క్షమించావు. ఈ తప్పుగూడా క్షమించు. నేనీ వివాహం చేసుకోను!'

కొడుకు మాటలూ, ముఖ కవళికలు చూసి, భువనేశ్వరి ఉద్విగ్నచిత్త అయింది. 'సరే! చేసుకోకు. ఇక్కడనుండి నువ్వెళ్ళిపో. నాకు చాలా పనులున్నాయి!' అన్నది చికాగ్గా.

'కాదమ్మా!' అన్నాడు శేఖరుడు నవ్వాలని ప్రయత్నం చేస్తూ. 'నేనీ పెళ్లి చేసుకోను.'

'ఎందుకురా? నువ్వు కావాలన్నప్పుడు కావడానికి, వద్దన్నప్పుడు మానడానికి, ఇది పిల్లల బొమ్మలాటగాదు శేఖర్!'

'పిల్లల ఆట కాదు గనుక నే చెబుతున్నా నమ్మా!'

భువనేశ్వరి భయపడింది.

'శేఖర్! ఏంజరిగిందో నాకు స్పష్టంగా చెప్పు. నాకీ గందరగోళాలేమీ పనికి రావు.'

'ఇప్పుడు కాదు. మరొకరోజున చెబుతాను.'

'మరొకరోజు నెప్పుడో చెబుతా వన్నమాట' అన్నది భువనేశ్వరి కోపంతో గుడ్డలనక్కడ పారేసి. 'అయితే నన్ను వెంటనే కాశీ పంపించు. ఇలాంటి సంసారంలో, నేనో క్షణంగూడా ఉండలేను. లలిత గూడా నాతో బాటే వస్తానంటున్నది. దానికి కావలసిన ఏర్పాట్లు గూడా చెయ్యి.'

శేఖరుడు నవ్వుతూ 'నువ్వు తీసు కెళ్ళ దలచుకొంటే, వేరే ఏర్పాట్లు గూడా ఎందుకమ్మా? నీ ఆజ్ఞను అది ఎలాగూ మీరదు' అన్నాడు.

నవ్వుతున్న కొడుకు ముఖం చూసే సరికి, ఆమె గారి ఆశలు తిరిగి చిగురించాయి. లలిత కేసి తిరిగి అన్నది: 'వింటున్నావా తల్లీ శేఖర్ బాబు మాటలు! నేను తలుచుకొంటే, నిన్నెక్కడి కయినా తీసుకెళ్ళగలనని వాడను కొంటున్నాడు. అంతే గానీ మీ అత్తగారిని గూడా అడగాలని వాడు మరిచి పోయాడు.'

లలిత జవాబు చెప్పలేదు. శేఖరుని ధోరణి చూసి, ఆమె భయపడ సాగింది.

'ఆమెను అడగాలనుకొంటే అలాగే అడుగు. అది నీ ఇష్టా యిష్టాల మీద ఆధారపడి ఉంటుంది. కానీ, నువ్వు ఎలా అంటే, అలానే జరుగు తుందమ్మా! ఈ సంగతి నాకు తెలుసు. నువ్వు వెంట తీసు కెళ్ళాలను కొంటున్న నీ కోడలు లలితకూ తెలుసు.'

శేఖరుడు తల వంచుకొన్నాడు.

భువనేశ్వరి ఆశ్చర్యంతో కొయ్యవారి పోయింది. కన్నతల్లి నా కొడుకు ఇలా పరిహాసించడం? ఆమె కొడుకువేపు కోపంగా చూస్తూ 'ఏమిట్రా! లలిత నాకేమవుతుంది?' అని గద్దించింది.

శేఖరుడు తలెత్తకుండానే సమాధాన మిచ్చాడు.

'చెప్పానుగా అమ్మా! ఇది-ఈ నాటి సంగతి కాదు. ఇది జరిగి నాలుగేళ్ళకు పైగా అయింది. వివరంగా నేను చెప్పలేను. దాన్ని నువ్వే అడుగు.'

—అని తలెత్తి చూశాడు. లలిత, భువనేశ్వరికి నమస్కరించ బోతున్నది. శేఖరుడు గూడా ప్రక్కకొచ్చి నిలబడ్డాడు. ఆ తరువాత ఉభయులూ కలిసి, భువనేశ్వరి పాదాలకు ప్రణమిల్లారు'

భువనేశ్వరి కన్నులు ఆనందాశ్రువులను రాల్చాయి. నగలపెట్టె తెరచి, అందులోని తన నగలన్నీ ఒక్కొక్కటే లలితకు అలంకరిస్తూ,

క్రమంగా అన్నీ విషయాలనూ తెలుసుకొన్నది. అన్నీ విన్న తరువాత, 'అందుకనేనా తల్లీ, గిరీంద్రుడు అన్నాకాళిని పెళ్ళిచేసుకొంది?' అనడిగింది భువనేశ్వరి.

'ఔనమ్మా! అందుకే అన్నాకాళీని పెళ్ళి చేసుకొన్నారు. గిరీన్ బాబు లాంటి మనుష్యులు ఈ ప్రపంచంలో ఉన్నారో లేకో నేను చెప్ప లేను. నేను- వారితో, నాకు వివాహ మయిందనీ, నా భర్త నన్ను స్వీక రించినా, పరిత్యజించినా, వారి ఇష్టమేననీ, వారు సజీవు లేననీ అన్నాను. నా మాటను వారు సంపూర్ణంగా విశ్వసించారు'

'ఉండట మేమిటి తల్లీ!' అన్నది భువనేశ్వరి లలిత తలను నిము రుతూ. 'జన్మ జన్మాలకూ చిరంజీవులు అయి ఉండాలని నేను ఆశీర్వదిస్తు న్నాను. కొంచెం సేపిలా కూచో అమ్మా! నేను పోయి, పెళ్ళి కూతురు మారిందని, అవినాశ బాబుతో చెప్పి వస్తాను.' అంటూ చిరునవ్వు నవ్వుతూ, పెద్దకొడుకు గదికేసి వెళ్ళింది భువనేశ్వరి.



తప్పకుండా చదవండి !

# ఉమర్ ఖయ్యాం!

[వర్ణచిత్ర పద్య సంపుటి]

విశ్వసాహిత్యంలో విశిష్ట స్థానా న్నందుకొన్న ఉమర్ ఖయ్యాం రచనలు తెలుగు పాఠకులకు సుపరిచితాలే! ప్రపంచంలోని ఎన్నో భాషలలోనికి అనువదింపబడిన, ఖయ్యామ్ ఉత్తమ కవితకు, సరళమూ, మాధుర్యమూ, అయిన ఆంధ్రానువాదంలోని, మణిపూసల వంటి పద్యాలతో, భావస్ఫోరకమైన 18 వర్ణచిత్రాలతో, త్రివర్ణ ముఖచిత్రంతో, ఆర్టు పేపరుపై ముద్రించబడిన గ్రంథం.

బహూకరణకు తగినది.

వెల : **8** అణాలు మాత్రం

**వివరాలకు:**

**జ్యోతి కార్యాలయం,**

మద్రాసు-17.

తప్పక చదవండి!

## స్త్రీ బుద్ధి...

## జీవితం!

[కథల సంపుటాలు]

రచన: రాజేశ్వరీదేవి

మానవ మనస్తత్వాన్ని శోధించి, సజీవపాత్రలతో, జీవితంలోని వివిధ సంఘటనలను చిత్రించిన ఉత్తమ కథలు.

ఒక్కొక్కటి రు. 0—8—0



## సినీతార మర్మరహస్యం

## భామా కలాపం

[డిటెక్టివ్ నవలలు]

రచన: దాసు

మిమ్ములను ప్రతిక్షణం భయభ్రాంతులను చేసె, సంఘటనలతో, అపూర్వమైన ఇతివృత్తాలు గల ఉత్తమ డిటెక్టివ్ నవలలు.

ఒక్కొక్కటి రు. 0—8—0 లు

రు. 2—8—0 లు పంపినవారికి పై నాలుగు పుస్తకాలు రిజిస్టర్డు పోస్టులో పంపబడతాయి.

వివరాలకు:

## జ్యోతి కార్యాలయం

మద్రాసు — 17.

PARINEETA 8 As. SARAT

